వలయునను వాదమును మాత్రము మనము సహింపజాలము; ప్రతి ఘటించి తీరుదుము. నేడు మన జాతికి కావలసినది చైతన్యము, పౌరుషము. మన సారస్వతమున కవసరమైన రసము వీరము. అందుకు సాధనము వీరపూజ. వీరపూజకు వలయు సామగ్రి మన యాంధ్ర చరిత్రమున కావలసినంత కలదు. కుమార కవి సింహులు తమదృష్టి నీవంక మరల్పవలయును.

———:———

# జాతీయోద్యమము - వాఙ్మయప్రభావము



నిద్రాణమైయున్న జాతిని మేలుకొలుపుటకు సాహిత్యముకన్న మహత్తరమైన సాధనము మరొక్కటి లేదు. ఒక దేశముయొక్క కష్టసుఖములు, మంచి చెడ్డలు, ఒడుదుడుకులు, ఆ వాఙ్మయములో ప్రతిబింబించుచుండును. ఒక జాతి చరిత్రను నిర్మించుటలో రచయితలకుగల ప్రభావము అమోఘమైనది. రూసో, వాల్టేరుల రచనలు ఫ్రెంచి విప్లవమునకు కారణభూతములైనవి.

టాల్‌స్టాయి, మాక్సింగోర్కీ, డాస్టావోస్కీ ప్రభృతులు రష్యన్ వాఙ్మయముద్వారా ఆ దేశీయులలో అద్భుతమైన ప్రబోధము కలుగజేసిరి. శ్రీకృష్ణదేవరాయల నిర్యాణానంతరము శత్రురాజొకడు విజయనగరము మీద దండెత్తి వచ్చినప్పుడు అల్లసాని పెద్దన చెప్పిన పద్యము విని సిగ్గిల్లి ఆ రాజు తన సైన్యముతో పలాయనము చిత్తగించినాడట. ఖడ్గతిక్కన రణరంగమున వెన్నిచ్చి, యింటికి మరలి వచ్చినప్పుడు, ఆతని తల్లి, మరియు భార్య చెప్పిన చాటు పద్యములు ఆతనిలో పరాక్రమము విజృంభింపజేసి, యుద్ధభూమికి పంపినవట. ఇవన్నియు రచయితలకు, వాఙ్మయమునకు, దేశచరిత్రలను దిద్ది తీర్చుటలోగల ప్రభావమునకు స్థాలీపులాకముగా పేర్కొనబడిన నిదర్శనాలు మాత్రమే.

బ్రిటీష్ పరిపాలన క్రింద అణగిపోయిన భారతీయులను, తమ విధ్యుక్తధర్మములను పాలింపవలసినదని ప్రబోధించి, మేలుకొలిపినది వాఙ్మయమే యని చెప్పిన అతిశయోక్తి కాజాలదు. ఒక యుద్యమము చక్కగా వ్యాప్తిజెందుటకు వాఙ్మయము మిక్కిలి శక్తివంతమైన సాధనమని భారత స్వాతంత్ర్యోద్యమ చరిత్ర నిరూపించు

చున్నది. ప్రబుద్ధభారతమునకు తొలి వైతాళికులు రచయితలేనని చెప్పవచ్చును.

మన దేశీయులను మేలుకొలిపిన ప్రప్రథములలో స్వామీ దయానంద సరస్వతి ముఖ్యుడు. ఆయన వ్రాసిన సత్యార్థ ప్రకాశిక బహుభాషలలో పరివర్తింపబడి అసంఖ్యాకులగు ప్రజల హృదయా లలో జాతీయ ఆత్మగౌరవ బీజములను చల్లి, వారిచేత దేశము యొక్క గొప్పదనమును గుర్తింపజేసినది. తమకొక ప్రత్యేక సంస్కృతి, భాస్వంతమైన చరిత్ర కలదనియు, అందు కనుగుణముగా తమ భవి ష్యత్తును నిర్మించుకోవలెననియు సత్యార్థప్రకాశిక ప్రబోధించినది. రాజా రామమోహనరాయిచే ప్రబోధితమైన వంగదేశమున, ఈశ్వర చంద్ర విద్యాసాగర ప్రభృతులు దేశీయులలో తమ రచనలద్వారా చైతన్యమును కలుగజేసిరి.

తరువాత స్వామీ వివేకానందుని రచనలు, ఉపన్యాసములు ఆసేతు హిమాచల పర్యంత ప్రదేశమున ఉద్బోధము చైతన్యము కలుగజేసినవి. ముఖ్యముగా విదేశాలలో వివేకానందునివలనభారతదేశ వ్యక్తిత్వము ప్రపంచమునకు బోధపడినది. పాశ్చాత్యదేశాలలో భార తీయులు అనాగరికులు, అడవి మనుష్యులను అపోహలను వివేకా నందుడు తొలగించెను. వంగదేశములో క్రమక్రమముగా వ్యాపించు చున్న క్రీస్తుమత ప్రచారమును అరికట్టుటకు మరొకవంకనుండి బ్రహ్మ సమాజము ఉద్భవించినది. శ్రీ రఘుపతి వేంకటరత్నమునాయుడు, వీరేశలింగము పంతులుగార్లద్వారా ఆంధ్రదేశముమీద బ్రహ్మసమాజ ప్రభావము ఎక్కువగా పడినదని చెప్పవచ్చును. కేశవచంద్రసేనుని రచనలు వంగదేశమునందలి యువకులను ఊపి ఉత్సాహతరంగితు లను జేసినవి. ఈవిధముగా దేశములో సంచలనము కలుగజేసి, ప్రజలలో చైతన్యము వ్యాపింపజేయుటకై ఉద్యమములు క్రమక్రమ ముగా తల యెత్తినవి. ఈ యుద్యమాల ప్రచారము భారతదేశము నందలి వివిధ భాషలలో విరివిగా జరిగినది.

భారత రాజకీయాలలో డాక్టరు అనీబిసెంటు ప్రవేశము ఒక చారిత్రాత్మక ఘట్టము. ఆమె మన జాతీయోద్యమమునకు తొలిసారి విప్లవ దృక్పథము నిచ్చిన వీరనారీమణి, త్యాగశీల, హోం రూలు ఉద్యమముద్వారా, శాసనోల్లంఘనముజేసి చెరసాలకరిగి, ప్రజలలో జెయిలు భయమును తొలగించిన గౌరవము డాక్టర్ అనీబిసెంటుకు చెందుచున్నది. భారతీయ సంస్కృతి, నాగరికతా విజ్ఞానములమీద ఆమెకు అత్యంత గౌరవము. భగవద్గీతను ఇంగ్లీషులోనికి అనువదించి, యువకులలో గీతాప్రచారము గావించి, భారతీయులలో దేశాభిమానము ప్రచారముజేయుటకు ఆమె జేసిన సేవ అత్యంత ప్రశంసనీయమైనది. దివ్యజ్ఞానసమాజ ఉద్యమముద్వారా, దివ్యజ్ఞాన సమాజ సంఘములు స్థాపించి ఉపన్యాసములలో భారతదేశమును ప్రబుద్ధము గావించినది, డాక్టర్ అనీబిసెంటు. విద్యాధికులు, విద్యార్థులు, యువకులు డాక్టర్ అనీబిసెంటుకు అనుచరులుగా చేరిరి. ఆమె ప్రారంభించిన హోం రూల్ ఉద్యమమునకు శ్రీ సి. పి. రామస్వామి అయ్యర్, పండిత్ జవాహర్‌లాల్ నెహ్రూగార్లు కొంతకాలము సంయుక్త కార్యదర్శులుగా పనిజేసిరని ఇక్కడ ప్రస్తావించుట పేర్కొనదగిన విశేషము.

మరొక ప్రక్కనుండి మహారాష్ట్రములో వీరసవర్కార్ విప్లవ ధ్వజమును ఎగురవేసి, సోదరదేశీయులలో తన పుస్తకములద్వారా ప్రబోధము సాగించెను. మహారాష్ట్ర సామ్రాజ్యస్థాపన, ఉన్నతి, పతనములనుగూర్చి వివరించుచు, సవర్కార్ వ్రాసిన హిందూపద్ పాదుషాహి గ్రంథము మహారాష్ట్రులలో స్వతంత్రభావములను కలుగజేసెను.

1857 సంవత్సరములో మన దేశమున బ్రిటీషు పరిపాలన మీద ప్రకటింపబడిన స్వాతంత్ర్యయుద్ధమును, బ్రిటీష్ ప్రభుత్వము కొందరు విద్రోహుల సహాయముతో అణచివేసి, దానిని ఒక తిరుగుబాటుగ మాత్రమే చిత్రించినది. వీరసావర్కార్ యీ 1857 విప్లవమునుగూర్చి "భారతస్వాతంత్ర్యసమర మను ఒక ఉద్గ్రంథమును రచించెను."

మహోజ్జ్వలమగు యీ గ్రంథమును బ్రిటీష్ ప్రభుత్వము నిషేధించినను రహస్యముగా ఎందరో యువకులు దానిని పఠించి, సోదర దేశీయులలో స్వాతంత్ర్యోద్యమ ప్రచారము చేసిరి. ఈ గ్రంథమును పఠించినారను నేరముమీద ఎందరో యువకులు అరెస్టు అయినారు. "భారత స్వాతంత్ర్యసమరము" దేశీయుల రక్తమును ఉడుకెత్తించి, స్వాతంత్ర్య కాంక్షలు చెలరేగ జేసినది. లోకమాన్య బాలగంగాధర తిలక్, మరాఠా, కేసరి పత్రికలలో సంపాదకీయాలద్వారా దేశములో ప్రబోధము సాగించెను. స్వాతంత్ర్యభావప్రపూర్ణములగు ఆ సంపాదకీయాలకు బీతిల్లి, ఆయనను బ్రిటీషు ప్రభుత్వము నిర్బంధించినది. జెయిలును శ్రీకృష్ణజన్మస్థానమని భావించి, తిలక్ మహాశయుడు తన నిర్బంధకాలమున గీతాభాష్యమును కర్మయోగమను పేరుతో రచించెను. తిలక్ కర్మయోగమునకు, భారతదేశములో విశాలవ్యాప్తి కలిగినది. కర్మయోగముద్వారా భారతీయులు తమ విధ్యుక్తధర్మమును గుర్తించి, పరదేశ ప్రభుత్వ దాస్య బంధములను త్రెంచివేయవలెననియు, శ్రీకృష్ణుని బోధలలోని రహస్య మిదియేననియు బాల గంగాధరుడు ప్రబోధించెను. తిలక్ కర్మయోగము భారతదేశములోని అన్నిభాషలయందు అనువదింపబడినది. స్వాతంత్ర్యము నా జన్మహక్కని బాల గంగాధరుడు గర్జించెను. గోఖలే, దాదాభాయి నౌరోజి, రమేశచంద్రదత్తులు ఆంగ్ల రచనలద్వారా, విద్యాధిక ప్రపంచమునకు, బ్రిటీష్ పరిపాలనవలన నష్టములను సకారణముగా నిరూపించి, స్వపరిపాలన ఆవశ్యకతను ఋజువుచేసిరి. కాని వారి రచనలు ఆంగ్ల విద్యాధికులకు మాత్రమే ఉపకరించినవి. ఇవి ఇతర భాషలలోనికి అనువదింప బడలేదు.

మహారాష్ట్ర దేశమున లోకమాన్య బాలగంగాధరతిలక్‌తో పాటు తన కలమును జాతీయోద్యమ ప్రచారమునకు వినియోగించిన విద్వాంసుడు శ్రీ చింతామణి కేల్కార్. తిలక్ తరువాత కేసరి పత్రికకు సంపాదకుడుగా పనిజేసి ఆయన మహారాష్ట్ర దేశములో జాగృతిని కలిగించెను.

మహారాష్ట్రభాషలో జాతీయోద్యమ వ్యాప్తికి తోడ్పడిన రచయితలలో శ్రీ సానే గురూజీ ప్రముఖులు – ఈయన తన రచనలలో ప్రాచీన సంస్కృతిని, పురాణములను, భారతీయ సాంఘిక పద్ధతులను సామ్యవాద సూత్రములతో సమన్వయించినాడు. మామా వరేర్కర్ తన లేఖినిద్వారా, మన విద్యాధికులు క్రైస్తవ మిషనరీల వలె దేశాభ్యుదయమునకై జీవితాలను అంకితము చేయవలెనని, ధర్మాదాయములను జాతీయము చేయవలెననియు ప్రబోధించెను. ఈయన రచనలలో హాస్యము, చమత్కారము ఉట్టిపడుచుండును.

మహారాష్ట్ర దేశములో ఖాండేకర్, హిందీలో ప్రేంచందు వలె, తెలుగులో శ్రీ చింతా దీక్షితులుగారు, చిన్నకథలద్వారా జాతీయోద్యమ ఘట్టములను చక్కగా చిత్రించిరి. నారాయణ సీతారాంఫడ్కే సుప్రసిద్ధ నవలా రచయిత– సమకాలిక సమస్యలు, యీయన నవలలకు యితివృత్తములు. తిలక్ కాలమునందలి రాజకీయాలను ప్రవాసియను నవలయందు, 1942 విప్లవమును జంఝా మారుతము అను నవలయందు ఫడ్కేగారు చక్కగా వివరించిరి. చీకటిబజారును, ప్రజాహిత జీవనములోని అవినీతిని నిర్దాక్షిణ్యముగా యీయన తన రచనలలో ప్రకటించి, సంఘమునకు దారిజూపినాడు.

ఇటీవల యీయన కాశ్మీరు సమస్యనుగూర్చి కూడ ఒక చక్కని నవలను వ్రాసినాడు.

మహారాష్ట్ర దేశములో గాంధీ రాజకీయాలను, గాంధీ వాఙ్మయమును వ్యాప్తిలోనికి దెచ్చిన పండితులు, రచయితలు ఆచార్య వినోబాభావే, కాకా కలేల్కరుగార్లు–

ఆచార్యఅత్రే సంఘములోని చాదస్తములనన్నింటిని తూర్పారబట్టిన విమర్శకుడు. హాస్యమునకు ఆటపట్టులగు యీయన రచనలు మహారాష్ట్రదేశమున మంచి ప్రబోధము కలిగించినవి. మహారాష్ట్ర జాతీయ కవులలో గోవింద అగ్రజ్, తాంబేగారు ప్రముఖులు.

హిందీభాషలో జాతీయోద్యమ ఘట్టములకు వాఙ్మయములో స్థానమొసంగిన కథకులు మున్షీ ప్రేమచంద్, సుదర్శన్‌గార్లు.

మున్షీప్రేమచంద్ కథలు అన్ని భాషలలోనికి ముఖ్యముగా తెలుగుభాష లోనికి చాలవరకు పరివర్తింపబడినవి. బెంగాలు కాటకమునుగూర్చి, శ్రీ సుదర్శన్ వ్రాసిన అన్నదాతయను గ్రంథము సుప్రసిద్ధమైనది. హిందీ జాతీయ కవులలో శ్రీ మైథిలీశరణగుప్త, మహాదేవీవర్మగార్లు ముఖ్యులు. క్షితీంద్ర మోహనసేన్, దేవేంద్ర సత్యార్థి గార్లు హిందీ భాషలో జాతీయ వాఙ్మయమును బహుళముగా సృష్టించిరి. భారత రాజ్యాంగ పరిషత్తు సభ్యులు శ్రీ బాలకృష్ణ శర్మగారు హిందీభాషలో మంచి రచయితలు. ఆధునిక హిందీరచయితలలో రాహుల్ సాంకృత్యాయన్ ప్రముఖులు. ఈయన రచనలయందు విప్లవ దృక్పథము ప్రముఖముగా నుండును. "వాల్గా నుండి గంగాతీరమువరకు" అను రాహుల్ సాంకృత్యాయన్ గ్రంథము సుప్రసిద్ధమైనది.

కర్ణాటక సాహిత్యములోగూడ ఇట్టి పరిణామము మనకు కనుపించుచున్నది.

ఆలూరి వెంకటరావుగారు గాంధీ రాజకీయాలకన్నముందే కర్ణాటక దేశములో దేశభక్తిని ప్రబోధించు రచనలు గావించిరి. కర్ణాటక భాషలో శ్రీ కృష్ణశర్మగారు జాతీయ సమస్యలను ప్రజలకు విప్పి చెప్పు రచనలను విరివిగా చేసినారు. అంబికాతనయదత్తు, మన శ్రీశ్రీవలె, కర్ణాటక భాషలో విప్లవ ధ్వజమునెత్తిన రచయితలు. భారతరాజ్యాంగ పరిషత్సభ్యులు మరియు కేంద్రప్రభుత్వ ఉపమంత్రి శ్రీ దివాకర్ గారు కర్ణాటక భాషలో గాంధీరాజకీయాలకు గాంధీ వాఙ్మయమునకు చక్కని సమీక్షలను వ్రాసిరి. వీరిని మనము శ్రీ ముట్నూరి కృష్ణారావుగారితో పోల్చవచ్చును. ఆచార్య గోకాక్ జాతీయ వాఙ్మయ సమీక్షకులలో ఎన్నతగినవారు. రాజరత్నం, పుట్టప్ప గార్లు ఉత్తేజకరమైన జాతీయ గేయములను రచించిరి.

స్వాతంత్ర్యజ్యోతిని మారుమూల పల్లెలలోనికి దీసికొనివెళ్ళి, ఇంటింట వెలిగించి చీకటిలోనున్న ప్రజా సామాన్యమునకు వెలుతురు జూపించి, భారతీయ జాతీయోద్యమమును నిజమైన ప్రజల ఉద్యమముగా జేసిన సంపూర్ణ గౌరవము గాంధీమహాత్మునికే చెందు

చున్నది. గుజరాతీలో-నవజీవన్; ఇంగ్లీషులో-యంగ్ ఇండియా,మున్నగు పత్రికలద్వారా గాంధీమహాత్ముడు ప్రజలలో జాతీయ భావాలను ప్రజ్వరిల్లజేసెను. ఇంగ్లీషుభాషయందును, గుజరాతీ యందును, గాంధీ మహాత్ముని కలము అత్యంత శక్తివంతమైనది. పూవువలె మృదువే గాక, వజ్రమువలె కఠోరమైనదికూడ ఆయన రచన. గాంధీమహాత్ముని వ్యాసములు ఆసేతు హిమాచలపర్యంతము ప్రజలను పులకాంకిత గాత్రులను జేసి, స్వాతంత్ర్య సమరములో వారు నడుమకట్టి ముందుకు దూకుటకు ఉపయోగ పడినవి. క్విట్ ఇండియా సందర్భమునందును, అంతకు ముందును, ఆయన నిర్వహించిన వివిధ ఉద్యమాల సందర్భము నందును ఆయన వ్రాసిన వ్యాసములకు ప్రపంచ వాఙ్మయమున నత్యున్నతస్థానము కలదు. రస్కిన్, టాల్‌స్టాయిల రచనల ప్రభావము గాంధీమహాత్ముని జీవితముమీద యెక్కువగా పడినదని చెప్పవచ్చును. మహాత్మునివలెనే జవహర్లాల్ కూడ రచనలద్వారా, భారత దేశ మును ప్రబోధించెను.

ఈ సందర్భములో భారత స్వాతంత్ర్య ఉద్యమమునకు తోడ్ప డిన విదేశీయుల రచనలను గూర్చి కూడ ప్రస్తావించుట అవసరము.

సండర్‌లాండు వ్రాసిన ఇండియా ఇన్ బాండేజి (దాస్యబంధా లలో జిక్కుకొనిన భారతదేశము), రామ్సే మాక్డోనాల్డు రచనలు మున్నగునవి భారత జాతీయోద్యమ ప్రచారమునకు బాగుగా తోడ్పడినవి. మనదేశములో-అమృతబజారు పత్రిక; ప్రకాశం పంతు లుగారి స్వరాజ్య; బొంబాయి క్రానికల్; చింతామణిగారి లీడర్; ట్రిబ్యూన్ మున్నగు పత్రికలు నిర్భయ విమర్శలద్వారా, దేశములో చైతన్యము, ప్రబోధము కలుగ జేసినవి.

భారత జాతీయోద్యమమును గూర్చి వ్రాసిన విదేశీయులలో బ్రెయిల్స్‌ఫర్డు గారికి ఉన్నతస్థానము గలదు. భారతజాతీయకాంగ్రెస్ ఆశయాలను ధైర్యముతో తమ రచనలద్వారా సమర్థించినవారిలో బ్రెయిల్స్‌ఫర్డుగారు ముఖ్యులు.

1942 సంవత్సరమున గాంధీ, నెహ్రూ, పటేలు మున్నగు నాయకులు చెరసాలలో బంధింపబడిన తరువాత, భారత జాతీయోద్యమమును, దౌర్జన్యపద్ధతులద్వారా అణచివేయుటకు బ్రిటీషు ప్రభుత్వము ప్రయత్నించిన సందర్భమున, సుప్రసిద్ధ పత్రికా రచయిత లూయీఫిషర్ భారత జాతీయ కాంగ్రెసును గూర్చియు, మన జాతీయోద్యమమును గూర్చియు, వ్రాసిన వ్యాసములు, ప్రపంచమును దిగ్భ్రాంత మొనరించి, భారతీయుల హక్కులు న్యాయమైనవని ప్రపంచమునకు ఋజువు చేసినవి. భారత జాతీయోద్యమ చరిత్రలో లూయీఫిషర్ రచనలు చిరస్మరణీయములు.

వందేమాతరం గేయము భారతీయులను ప్రబోధించుటలో చేసిన సేవనుగూర్చి యెంత ప్రశంసించిన తక్కువయే. బంకించంద్రుని జీవితకాలమున ఆయన నవలలు, వంగదేశమును ప్రబోధించినవి. కాని, తరువాత క్రమక్రమముగా జాతీయోద్యమ విస్తరణతో రాజకీయాలలో, గాంధీమహాత్ముని అవతరణతో, జాతీయోద్యమము దాల్చిన విప్లవ పరిణామముతో వందేమాతరం గీతము సకల భారతీయుల హృదయాలను ఉత్సాహతరంగితము జేసి, వారి నెత్తురును ఉడుకెత్తించి, ఉత్తేజితులను గావించినది. ఈ గీతముకొరకు ప్రాణములనైన ఒడ్డుటకు యువకులు సంసిద్ధులైరి. వందేమాతరమనగా జాతీయోద్యమమునకు, భారత స్వాతంత్ర్యజ్యోతికి పర్యాయపదమైనది. భారతదేశములో వందేమాతరంవలె ప్రజల హృదయాలమీద ఆధిపత్యము వహించిన గేయము మరొక్కటి లేదనిన సత్యమునకు తలవంపులు వాటిల్లవు. రవీంద్రుడు శక్తివంతమైన ఒక మహాసంస్థగా అవతరించి భారతీయులలో ప్రబోధము గావించెను. నేడు రవీంద్రుని 'జనగణమన' భారతజాతీయ గేయముగా అంగీకరింపబడినది. వంగభాషలో శరత్ చంద్ర ప్రభృతులు, తమ రచనలద్వారా, సోదర దేశీయులను ప్రబోధించిరి. మహర్షి అరవిందునికి రవీంద్రునితో సమానమైన స్థానము వంగదేశమున కలదు. గాంధీమహాత్ముడు, రాజకీయరంగమున ప్రాధాన్యత వహించకముందే, ఆయన గీతాఉపన్యాసములు

వంగదేశమును ఉత్తేజిత మొనరించినవి. ఆ దినాలలోని వంగ దేశమునందలి విప్లవోద్యమ నాయకులందరును అరవిందుని గీతా ఉపన్యాసములను విని, ప్రబోధితులై, భారతమాత సేవకు జీవితములను అంకితము జేయుటకు నిశ్చయించి ముందుకు వచ్చినవారే యని చెప్పవచ్చును. ఇంగ్లీషులో శ్రీ కె. యస్. వెంకటరమణి మున్నగువారు రచించిన గ్రంథములు విద్యాధికులను, విద్యార్థులను ప్రబోధితులను జేసినవి. వెంకటరమణిగారి గ్రంథములు-తెలుగులోకూడా పరివర్తించబడినవి.

తెలుగు దేశమున వాఙ్మయముద్వారా ప్రజలను మేలుకొల్పిన వైతాళికుడు శ్రీ వీరేశలింగం పంతులు. వీరేశలింగం పంతులుగారు తమ రచనలద్వారా సంఘములోని కుళ్లును బయటపెట్టి, సంస్కరణోద్యమమును, మాటలతో ప్రచారము జేసి సంతృప్తిజెందక,ఆచరణలోనికి దెచ్చిరి. వీరేశలింగముగారిది సంస్కరణ దృక్పథము. రాజకీయముగా వీరేశలింగముగారు ప్రజాప్రబోధము చేయకపోయినప్పటికి వారి సంఘ సంస్కరణోద్యమము ఆంధ్రుల కన్నులు తెరిపించి, జాతీయోద్యమ వ్యాప్తికి ఆంధ్రదేశములో మంచి అవకాశము కలుగజేసినది. ఆంధ్రపత్రికను స్థాపించిన స్వర్గీయ దేశోద్ధారక విశ్వదాత కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు ఆంధ్రదేశమున రాజకీయ చైతన్యమును కలుగజేయుటకు అద్వితీయమైన కృషిచేసిరి. ఆంధ్రుల ఏకైక దినపత్రికగా ఆంధ్రపత్రిక స్వాతంత్ర్యోద్యమ బీజాలను ప్రజా హృదయ క్షేత్రాలలో చల్లి, చిరస్మరణీయమగు సేవగావించినది. ఆంధ్రదేశములో రాజకీయ ప్రబోధము కావించిన పత్రికలలో కృష్ణాపత్రిక దిఅగ్రతాంబూలము. ఒకమారు శ్రీ ముట్నూరి కృష్ణారావుగారు తమ పత్రికలో యెక్కువగా వార్తల ప్రకటన జరుగుట లేదను ఆరోపణకు ప్రత్యుత్తర మిచ్చుచు, కృష్ణాపత్రిక వార్తాపత్రిక కాదనియు (News-paper), అది అభిప్రాయాల పత్రిక యనియు (Reviews paper) తెలిపిరి. భారతజాతీయ కాంగ్రెసు ఆదర్శాలను గూర్చి, కాంగ్రెసు అధ్యక్షోపన్యాసాలను గూర్చి జాతీయ భావ ప్రబోధకములగు కృష్ణా

పత్రిక సంపాదకీయములు ఆంధ్రదేశములో అపూర్వమగు సంచలనము కలుగజేసినవి. మారుమూలలనున్న ప్రజలు కృష్ణాపత్రిక సంపాదకీయములను చదివి, రాజకీయముగా చైతన్యవంతులైరి. నాయకులను, విద్యాధికులను, ప్రజాసామాన్యమును అందరినీ ఒక్కుమ్మడిగా ఊపి, ఉత్సాహతరంగితులను జేసినవి కృష్ణాపత్రిక సంపాదకీయాలు. రాధాకృష్ణునివంటి వేదాంతవేత్తలేకాక పల్లెటూరి ప్రజానీకమును గూడ కృష్ణా సంపాదకీయాలు ఉత్తేజితులను గావించినవి. నాయకులు, కార్యకర్తలు, సామాన్యప్రజలు ఆ పత్రికా సంపాదకీయాలను చదివి, ప్రబోధితులగుచుండెడివారు.

ఆంధ్ర, కృష్ణా పత్రికల ననుసరించి యితర పత్రికలు గూడా బయలుదేరి ఆంధ్రదేశ రాజకీయ వాతావరణమును సజీవముగా జేసినవి. యువకులు భావగేయముల ద్వారా, ప్రజానీకమును మాతృదేశసేవకై, ముందుకు వచ్చునట్లు చేసినారు. గురుజాడ, రాయప్రోలు కవీంద్రులు ఇట్టి యువకులకు మార్గదర్శకులైరి. దువ్వూరి, విశ్వనాథ, జాషువ, తుమ్మల కవీశ్వరుల రచనలు ఆంధ్రదేశములో దేశభక్తి, త్యాగదీక్షను ప్రబోధించినవి. శ్రీ గరిమెళ్ళ సత్యనారాయణగారు కృష్ణాపత్రికలో తమ గేయములద్వారా, సత్యాగ్రహోద్యమ ప్రబోధమును జేసిరి. "మా కొద్దీ తెల్లదొరతనము," "అంటరాని వారెవరో కాదు, మా వెంటరానివారె," "దండాలు దండాలు భరతమాత' అను గేయాలు అపారమైన చైతన్యము కలుగజేసినవి. ఆధునికాంధ్రకవిశేఖరుల రచనలలోని 'చావలేదు చావలేదు, ఆంధ్రుల మహోజ్జ్వల చరిత్ర,' 'దేశమంటే మట్టికాదోయ్, దేశమంటే మనుషులోయ్,' 'వీరగంధము తెచ్చినారము, వీరులెవ్వరో చెప్పుడీ,' 'కొల్లాయిగట్టితేనేమి మా గాంధి కోమటైపుట్టితేనేమి' అను గేయభాగాలు ఆంధ్రప్రజల నాలుకలమీద నాట్యముజేసినవి. భరతఖండపు చక్కని పాడియావుల వంటి పద్యములు ప్రజాసామాన్యములో బ్రిటీష్ పరిపాలనా స్వరూపమును బాగుగా చిత్రించినవి. రాయప్రోలు, గురుజాడ, విశ్వనాథ, జాషువా, తుమ్మల, దువ్వూరి మున్నగు ఆధునిక కవిశేఖరుల

రచనలు బహిరంగ సభలలో వేదికలమీద, శ్రావ్యముగా పఠింపబడి ప్రజలను చైతన్యవంతులుగా జేసినవి. సభలలో దేశభక్తి ప్రబోధ ములగు గేయాలు, పద్యాలు అద్భుతమైన జాగృతిని కలుగ జేసినవి.

ఈ జాతీయోద్యమ వాఙ్మయ ప్రభావఫలితముగా తెలుగులో వీరకావ్యములు గూడ బయలుదేరి, పరదేశపాలనా బంధములను త్రెంచుకొనుటకై ప్రబోధము జేసినవి. ఆధునిక కవులలో శ్రీ శివశంకరశాస్త్రి, శ్రీ అడివి బాపిరాజు, శ్రీ కొడాలి ఆంజనేయులు మున్నగువారు త్యాగ సమయములందు ముందుకు వచ్చి చెరసాలల నలంకరించిరి. శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణగారి 'మాలపల్లి' అను నవల ప్రజలలో చాలా ప్రచారము కలుగ జేసినది.

—— : ——

# శ్రీ సురవరం ప్రతాపరెడ్డి

ఆయన మితభాషి, సాధారణంగా, అడిగినంతవరకు జవాబు చెప్పి, తన పనేదో చేసికొనుట ఆయనకు అలవాటు. ఆధునిక నాగరికతా సంపర్క ఫలితాలైన కృత్రిమ మర్యాదలు, హావభావ విలాసాలు ఆయనలో కనుపించవు. ఆయనతో గాఢంగా పరిచయం లేనివారికి, ఒకటి రెండు మారులు మాత్రమే ఆయనను చూసినవారికి, ఆయన చాలా కటువైన మనిషిగా తోస్తాడు. తీవ్ర స్వరూపం, కొట్టొచ్చినట్లుండే మాటతీరు వెనక ఒక మెత్తని హృదయం ఉందని ఆయనతో పరిచయం అధికమైనకొద్ది తెలుస్తుంది. నిండుమనస్సు, నవ్యనవనీత హృదయం—పలుకుమాత్రం దారుణాఖండల శస్త్ర తుల్యం. ఇట్టి వ్యక్తి శ్రీ సురవరం ప్రతాపరెడ్డి.

శ్రీ ప్రతాపరెడ్డి-బహు భాషా విశారదులు; తెలంగాణంలో దేదీప్యమానంగా వెలుగుతున్న భాషాజ్యోతి; సంచార గ్రంథాలయం; సంభాషించే విజ్ఞానకోశం. 'సురవరంవారు రాజకీయాల్లోనే తన ప్రజా జీవితాన్ని ప్రారంభించారు,' అని ఆంధ్రపితామహులు శ్రీ మాడపాటి హనుమంతరావుగారుఅన్నారు. ఆంధ్రోద్యమానికిబీజావాపనంగావించిన రోజులు; అప్పుడే విశ్వవిద్యాలయాన్ని వదిలి ప్రతాపరెడ్డిగారు హైదరాబాదులో న్యాయవాద వృత్తిని ప్రారంభించారు. కాని ఆవృత్తి ఆయన స్వభావానికి సరిపడలేదు. అప్పటికే నెలకు ఏడెనిమిదివందల ఆదాయం వచ్చే న్యాయవాద వృత్తిని ముందు వెనకలు ఆలోచించకుండా వదిలేశారు. పత్రికా రచనలద్వారా దేశాభ్యుదయానికి తమ జీవితాన్ని ఈ విధంగా అంకితం చేయటానికి న్యాయవాద వృత్తిని విడిచిపెట్టిన మరొక ఆంధ్రవ్యక్తి మందుముల నరసింగరావు గారు. ప్రతాపరెడ్డి, నరసింగరావుగార లిద్దరూ హనుమంతరావుగారి సహచరులే. పై ఇద్దరు ప్రత్యక్షంగా పత్రికారంగంలో దూకారు.

ఆంధ్ర పితామహులు హనుమంతరావుగారు మాత్రం ప్రచ్ఛన్నంగా పత్రికా సంబంధం కలిగించుకొని, నేడు కూడా అదేవిధంగా పత్రికా రచన చేస్తున్నారు.

ఆ నాడు శ్రీ ప్రతాపరెడ్డి న్యాయవాద వృత్తినే అంటిపెట్టుకొని ఉన్నట్లయితే ఏనాడో న్యాయమూర్తి కాగలిగేవారు. ఆనాడే ఆయన తన పలుకుబడి ద్వారా ఏదైనా ఉద్యోగంలో ప్రవేశించి ఉన్నట్లయితే కావలసినంత డబ్బు సంపాదించి నేడొక ఉన్నతోద్యోగిగా వికసించెడివారు. కాని ఆ రెండు పనులు ఆయన చేయలేదు; ఆ రెండుపనులు ఆయన స్వభావానికి విరుద్ధమైనవి. ఇష్టంలేని పనిని దేవుడొచ్చి బలవంతపెట్టినా చేయడు. అదే ఆయన విశిష్టత.

రాజకీయాల్లో జీవితాన్ని ఆరంభించి, చివరకు కేవలం విద్వాంసుడుగా తయారైనాడు. ఆయనతోపాటు న్యాయవాదిగా ప్రవేశించి, మొట్టమొదట రాజకీయాల్తో కొంతకొంత సంబంధం మాత్రం కల్గించుకొంటూ, అంటీ అంటకుండా ఉండి, కొంత సాహిత్యాభిరుచికలిగి, బహుభాషా విశారదుడై, "ఆయన తనజీవితాన్ని సారస్వత సేవకే అర్పిస్తాడు" అని ప్రజలకు ఆశలు గొల్పిన శ్రీ బూర్గుల రామకృష్ణరావు నేడు ఇరువదినాల్గు గంటలూ రాజకీయాల్లో మునిగి తేల్తున్నారు. ప్రకృతిచిత్రం!

నేడు స్టేటుకాంగ్రెసు ఆంధ్రరాష్ట్రీయ సంఘంగా మారిన ఆనాటి (1929-30) ఆంధ్రమహాసభకు ప్రథమ అధ్యక్షుడు శ్రీ ప్రతాపరెడ్డి. తర్వాత ఆంధ్రమహాసభ సంపూర్ణంగా రాజకీయ సంస్థ అయింది. తెలంగాణాలో నివసించే వారంతా, తెలుగువచ్చినా రాకపోయినా తెలుగువారేనని ఆంధ్రమహాసభ నిర్ణయించింది. అందుకువిరుద్ధంగా శ్రీ ప్రతాపరెడ్డి ఒక ఉద్యమాన్ని లేవదీసి, ఆంధ్రమహాసభ వేదికమీద ఆంధ్రానికి మాత్రమే స్థానం ఉండాలని, ఆంధ్రులందరికీ తెలుగు తప్పనిసరిగా రావాలని గర్జించిన దినాలు జ్ఞాపకమున్నవి. ఈ వాదాన్ని పురస్కరించుకొని శ్రీ రెడ్డి ఆంధ్రమహాసభలో అభివృద్ధిపక్షాన్ని స్థాపించారు. కాని ఈ పక్షం ఎక్కువకాలం పనిచేయలేదు. తెరక్యాంధ్రులతో

సరిపడక, సురవరంవారు క్రమక్రమంగా రాజకీయాల నుంచి నిష్క్రమిం చారు. కాని నాటికీ నేటికీకూడ, ప్రతాపరెడ్డిగారు అతివాదియే. ఆనాటి అభివృద్ధిపక్షపు భావబీజాలే మొలకలెత్తి, తర్వాత ఆంధ్రసార స్వతపరిషత్తు యొక్క స్థాపనకు కారణభూతమైనవని చెప్పాలి.

తెలంగాణంలో దేశసేవకు, భాషాసేవకు తన జీవితాన్ని సంపూ ర్ణంగా ధారపోసిన ఏకైకవ్యక్తి శ్రీ ప్రతాపరెడ్డి అంటే అతిశయోక్తి కాదు. ఆయన బహుభాషా విశారదుడు. కనపడిన గ్రంథాన్ని ఆసాం తం వల్లించేవరకూ ఆయనకు నిద్రపట్టదు. కేవలం పఠించటమే కాదు— గుణదోషగ్రహణ దృష్టితో గ్రంథమందలి ప్రతి అక్షరాన్ని మననం చేస్తాడు. ఏ విషయాన్ని స్పృశించినా, దాని సారం చూడనిదే ఆయన వదలడు. శ్రీ ప్రతాపరెడ్డి పండితుడు—విమర్శకుడు— కవి— కథకుడు—వ్యాస రచయిత—విజ్ఞాని. ఆయన కవికంటె ఎక్కువగా విమర్శకుడు—విమర్శకుని కంటె ముఖ్యముగా సహృదయుడైన పండి తుడు. ఆయన రచించిన "రామాయణ విశేషములు" అనే గ్రంథంలో అగాధ పాండిత్యం, బహుళ గ్రంథ పరిచయం, నిశిత విమర్శనా పటిమ అక్షరక్షరానికి ప్రత్యక్షమవుతూనే ఉంటాయి. ఆంధ్రుల సాంఘిక జీవ నాన్ని గూర్చి ఆయన వ్రాసిన వ్యాసాలు, చరిత్రరచనకొక వినూత్న మైన ఒరవడి అని చెప్పాలి. "హైందవధర్మ వీరులు" ఆయన నిర్దుష్ట వచన రచనకు రమ్యమైన తార్కాణము. రెడ్డిగారు వ్రాసిన "నిరీక్ష ణము" అనే కథ తెలుగు కథానికా సాహిత్యానికి చక్కటి అలంకా రం. "తుకారాం" అనునాటకము ఆయన రచించిన గ్రంథములన్నిటి లోకి ఆయనకు చాలా అభిమాన పాత్రమైనదని ఆయన సంభాషణ లలో గ్రహించగలిగాను. పత్రికా రచయితగా ఆయనచేసిన దేశసేవ గోల్కొండ పత్రికా పాఠకులకు విదితమే.

తెలంగాణము నా జన్మభూమి అని ఉప్పొంగిపోతాడు. తెలం గాణంపై ఆయనకు గల అభిమానప్రేమలకు నిదర్శనం "గోలకొండ కవులసంచిక." ఈ సంచికను గూర్చి :

"గోలకొండ కవుల కుసుమములు సమకూర్చి
దండ గుచ్చె మా ప్రతాపరెడ్డి
అందు తావులీను అలరు సమర్పింప
బడయమైతి మకట భాగ్యరేఖ"–
అని శ్రీ శేషాద్రి రమణకవులు వ్రాశారు.

తెలంగాణములోని సారస్వత, సాంఘిక, రాజకీయ, విద్యా, వైజ్ఞానిక, సాంస్కృతిక సంస్థలు జరుపు కార్యకలాపాల్లో అధ్యక్ష పీఠం ఎప్పుడూ అయాచితంగా ప్రతాపరెడ్డిగారినే వరించడం పరిపాటి. విజ్ఞానవర్ధనీ పరిషత్తుకు రెడ్డిగారు స్థాపకులు. ఈ సంస్థ ఆయనకు అతి ప్రాణప్రదమైనది. విజ్ఞానవర్ధని అనేకుల హృదయాలలో విజ్ఞాన జ్యోతిని వెలిగించింది. ఆంధ్ర శారదార్చనకై తెలంగాణ యువకులను గాఢ నిద్రనుంచి మేలుకొలిపిన వైతాళికుడు—దేశికుడు—శ్రీ ప్రతాప రెడ్డి. రెడ్డివిద్యార్థి వసతిగృహాన్ని అభివృద్ధికి తెచ్చినవారిలో ముఖ్యుడు.



———:———

# తెలంగాణము-
# ఆధునికాంధ్ర వాఙ్మయ వికాసము

ఒక జాతియొక్క సర్వతోముఖ వికాసానికి, ఆ జాతి సాహిత్యానికి సన్నిహిత సంబంధముకలదు. ఈ సంబంధము పరస్పర ప్రభావముతో గూడుకొన్నదని ఏ జాతిచరిత్రను, ఏ వాఙ్మయచరిత్రను పరిశీలించినప్పటికిని స్పష్టముకాగలదు. ఒకజాతి సంస్కృతికి, నాగరికతకు ఆజాతి సాహిత్యమే కొలతబద్దవంటిది. సారస్వతములేని జాతి మృతప్రాయము. ఒక దేశచరిత్రను పరిశీలించినప్పుడు, ఆ దేశమునందు పుట్టి పెరిగిన అభ్యుదయకరమైనఉద్యమాలకుజీవనాధారముసారస్వతమనియే బోధపడ గలదు. దేశ కాల పరిస్థితులనుండి సాహిత్యము తప్పించుకొనజాలదు. అదేవిధముగా ప్రతిభావంతమైన సాహిత్యముయొక్క ప్రభావమును ఏజాతికూడ తప్పించుకొనజాలదు. దాస్యశృంఖలాబద్ధమై, పరాయి పాలనలో నలిగిపోవుచున్న భారతదేశమే, బంకించంద్ర చటర్జీ, ఈశ్వరచంద్ర విద్యాసాగరులు, రవీంద్ర కవీంద్రుల వంటి సాహితీ వేత్తలను గన్నది. వారి రచనలను విన్న భారతజాతి ఒక్కుమ్మడి సంకెళ్ళను త్రెంపుకొని స్వాతంత్ర్యోద్యమమునందుదూకినది. వారువంగరాష్ట్రమునకేకాక ఇతరరాష్ట్రములకు కూడ ఆదర్శప్రాయులైరి. వీరి రచనల ద్వారా భారతదేశ రాజకీయాలందు ప్రముఖపాత్రనువహించిన స్వాతంత్ర్యవీరులు, వన్నెకెక్కిన నాయకులు బంగాళా దేశమున ప్రభవించిరి. బంకించంద్రుని వందేమాతరగీతము యావద్భారత హృదయములో ప్రతి ధ్వనించి పులకెత్తింప జేసినది. సమకాలికముగా ఇతరప్రాంతాలయందు అక్కడి రచయితలద్వారా ఇట్టి చైతన్యమేకలిగినది.

మన తెలుగునేలగూడ ఈ పరివర్తననుండి తప్పించుకొనలేదు. వీరేశలింగం పంతులు, చిలకమూరు వీరభద్రరావు, కొమర్రాజు లక్ష్మణరావు పంతులు, చిలకమర్తి లక్ష్మీనరసింహము ప్రభృతుల సారస్వత సేవ ఆంధ్రదేశములో నవోదయానికి నాందీ ప్రస్తావనమైనది.

# పూర్వరంగము

ఆంధ్రజాతి మిక్కిలి ప్రాచీనమైనదని చరిత్ర ఉద్ఘోషించుచున్నది. రెండు వేల సంవత్సరాల క్రిందట ఆంధ్రదేశాన్ని పాలించిన మొట్టమొదటి స్వతంత్ర రాజవంశము సాతవాహనులది, ఆనాడు ఆంధ్రదేశపు సరిహద్దులు తూర్పున బంగాళాఖాతమువరకును, పడమర అరేబియా సముద్రము వరకును, ఉత్తరమున మధ్య హిందూదేశము నకు, దక్షిణాన మైసూరుదాకను వ్యాపించినట్టు చరిత్రవల్ల విశదము కాగలదు. సాతవాహనులు పరిపాలించిన రాజ్యము సమగ్రమమని యే చెప్పవచ్చును. అనగా సాతవాహనుల ఆంధ్రదేశములో మద్రాసు రాష్ట్రములోని తెలుగు జిల్లాలతోపాటు హైదరాబాదు రాష్ట్రము లోని తెలుగు జిల్లాలు కూడ చేరియుండెను. ఆనాడు ఆంధ్రులు కని పెంచుకొన్న మహోజ్వలమైన సంస్కృతి తూరుపుదీవులలోకూడ నడయాడినట్టు తెలియుచున్నది. తరువాత ఆంధ్రదేశ చరిత్రలో ఒడుదొడుకులెన్నియో కలిగినవి. చిన్నచిన్న రాజ్యములేర్పడుటతో తెలుగునేల చీలి, చిందరవందరయైపోయినది. అయితే-దేశ సమైక్యతకు నిజానికి భంగము వాటిల్లినది బ్రిటీషు పరిపాలనలోనేయని చెప్ప వచ్చును.

ఈస్టు ఇండియా కంపెనీవారు మనదేశములో ప్రవేశించి, క్రమక్రమముగా విస్తరించి అప్పుడు ఆంధ్రదేశానికి పరిపాలకుడుగా నున్న హైదరాబాదు నిజాంను తమకు ఆధీనునిగా జేసుకొనిన తరువాత, ప్రస్తుతము ఆంధ్రదేశములోని సర్కారు జిల్లాలు కంపెనీ పరి పాలన క్రిందికి 1760 లో తేబడినవి. అనగా హైదరాబాదులోని ప్రస్తుత తెలుగు జిల్లాలు నిజాం పరిపాలనక్రింద ఉండిపోయినవి, సర్కారు జిల్లాలు బ్రిటీషు పరిపాలనక్రిందికి వచ్చెను. ఇది జరిగి సుమారు రెండువందల సంవత్సరములు కావచ్చినవి.

చరిత్రలో ఈ రెండువందల సంవత్సరాలు యేమంత గొప్ప కాలము కాదు. అయినప్పటికి 1766 సంవత్సరములో జరిగిన కృత్రిమ భౌగోళిక విభజన ఫలితంగా ఆంధ్రుల సమైక్యతకు భంగము కలిగినదని

చెప్పవచ్చును. ఆనాటినుండి పరిపాలనదృష్ట్యా ఏర్పడిన ఈ పొలిమేరలు ఒకరి నొకరు అర్థము చేసుకొనుటకు ప్రతిబంధకము లైనవి.

హైదరాబాదు రాష్ట్రములో ఆంధ్రోద్యమ పితామహులు ప్రసంగవశమున నాకు జెప్పిన ఒక వృత్తాంతము ఈ సందర్భములో జ్ఞప్తికి వచ్చుచున్నది. వారు క్రొత్తగా ప్రజాహిత జీవనములో అడుగు పెట్టిన తర్వాత అనగా మూడు దశాబ్దాల క్రింద నన్నమాట; ఒక పర్యాయము వారు సర్కారు జిల్లాల ఆంధ్ర ప్రముఖులైన ఒకరితో ఏదో సంభాషించు సందర్భమున (వారు తరువాత అఖిల భారత రాజకీయాలలో ప్రథమ శ్రేణి నలంకరించిన వారు)-'హైదరాబాదులో ఆంధ్రులు కలరా!' యని ప్రశ్నించిరట. నేను, చాలామంది సర్కారు జిల్లాల ఆంధ్రులు సంభాషించినప్పుడు— "మీరు హైదరాబాదు వాసులైనప్పటికి తెలుగు మాట్లాడగలుగు చున్నారే" యని అనేకులు ఆశ్చర్యపడి యుండిరి. హైదరాబాదు తురకరాజ్యము అన్న భావమొక్కటే హైదరాబాదేతరులైన ఆంధ్రుల హృదయాలలో వ్యాపించియుండెను. ఆధునికాంధ్రవాఙ్మయమున ప్రసిద్ధులైన ఒక రచయిత తెలంగాణమున తెలుగు రచయితలు ఎవ్వరు? అని ఒకానొక సందర్భమున నన్ను ప్రశ్నించి యుండిరి. ఈ విధముగా రెండు వందల సంవత్సరాల కాలమున భిన్న పరిపాలన మరియు కృత్రిమ భౌగోళిక విభజన ఫలితంగా ఆంధ్రదేశ సమైక్యతకు రాజకీయంగానే కాక,సాంస్కృతికంగా కూడ పెద్ద గొడ్డలిపెట్టు తగిలెనని పైసంఘటనలే ఋజువు చేయుచున్నవి.

హైదరాబాదు రాష్ట్రములోని ఎనిమిది జిల్లాలు తెలుగు జిల్లాలు; హైదరాబాదు, సికిందరాబాదు నగరాలు ఆంధ్రనగరాలు. కాకతీయ సామ్రాజ్యమునకు కేంద్రమై యలరారిన ఓరుగల్లు హైదరాబాదు రాష్ట్రాంతర్గతము. తెలుగు దేశ చరిత్రలో, తెలుగు వాఙ్మయ చరిత్రలో హైదరాబాదులోని ఎనిమిది జిల్లాలకు అత్యధికమైన ప్రాముఖ్యతగలదు. నిజానికి మొట్టమొదటిసారి తెలుగు జాతీయతకు రూపురేఖలు దిద్దబడినది హైదరాబాదు రాష్ట్రములోనే యని చెప్పినచో

అతిశయోక్తి కాజాలదు. సుప్రసిద్ధ చరిత్ర పరిశోధకులైన శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారు- "మనది ఆంధ్రదేశం; మనమంతా ఆంధ్రులమనే జాతీయాభిమానము మొదటిసారి మనకు కాకతి గణపతి దేవరాయల కాలంలో కలిగిందని, ఆ రాజన్యుడే ఆంధ్రులందరిని ఒక్క రాజ్యంలోనికి తీసుకుని రావలెనని మొదటిసారి ప్రయత్నించినాడని" గ్రంథస్థము కావించినారు.

కాకతి గణపతిదేవుని రాజ్యపాలనలో మహోజ్వలంగా వెలిగిన ఆంధ్రరాజ్యలక్ష్మితోపాటు ఆంధ్రసారస్వతము, ఆంధ్రశిల్పము మూడుపూవు లారు కాయలుగా కాచి వృద్ధి బొందినవి. ఆంధ్రశిల్పకళాలక్ష్మి వేయి వన్నెలను దిద్దికొని మురిసిపోయినది. మార్కోపోలోవంటి విదేశయాత్రికులను దిగ్భ్రమ జెందించిన ఆంధ్రనగర వైభవము అనుపమానము. ఉత్తమశిల్పమునకు పట్టులగు సౌధములచే నలరారిన ఆ విశాల రాజవీథులు; శత్రురాజులకు దుర్భేద్యమై నిలచిన ఆ కోటలు; ఆ నాడు ఆంధ్రోర్వీశు మొగసాలపై మ్రోగిన ఘంటా ఝుణత్కారములు; ఆ పూటకూటింటిలోని కప్పురభోగి వంటకము; కమ్మని గోధుమపిండి వంట; ఆ చిత్రశాలలు; ఏకశిలానగర నాగరికజీవితమునకు ప్రతిబింబములై నేటికిని క్రీడాభిరామమున అక్షరరూపముతో శోభిల్లుచున్నవి. ఇట్లు ఆంధ్రదేశమునకు, ఆంధ్రసంస్కృతికి కేంద్రమై వెలిగిన ఆంధ్రనగరము తెలుగు జాతీయతకు వన్నెచిన్నెలు దిద్దుటలో ఆశ్చర్యములేదు.

ఒక్కమారు తెలుగు సాహిత్యచరిత్రను అవలోకించితిమేని, తెలంగాణమునకు ఆంధ్రవాఙ్మయచరిత్రలోనున్న ప్రత్యేకస్థానము కన్నులకు గట్టును. దేశ కాల పరిస్థితులవలన రచయితలకు, రచనలకు కొంతకాల మజ్ఞాతవాసము కలిగినది. తెలంగాణమందలి గ్రామాలలో తాళపత్రగ్రంథములు లేనివారు లేనేలేదని చెప్పిన అతిశయోక్తి కాజాలదు. ఆధునిక కాలమున ఇక్కడి సారస్వతోద్యమ వ్యాప్తిని పరిశీలించునప్పుడు రాజకీయ పరిస్థితులను మనము దృష్టిలోనుంచుకొనవలసి యున్నది. బ్రిటీషువారు ఏమి జేసినప్పటికిని,బ్రిటీషు ఇండియాలో

విద్యావ్యాప్తికై జరిగిన కృషిని నిరోధించలేదనియే చెప్ప వలెను. సారస్వత సభలకు బ్రిటీషు ప్రభుత్వము ప్రతిబంధకములను కల్పించలేదు. బ్రిటీషు ఇండియాలో రాజకీయాలతో సంబంధములేని సారస్వత కృషి జరుగుటకు కావలసినంత యవకాశము దొరికినది. అందుచేత కేవల సారస్వతోపాసకులైన వారికృషి నిరంతరాయముగా జరిగినదనియే చెప్పవలయును. ఆధునికాంధ్రవాఙ్మయ నిర్మాతలైన వీరేశలింగ ప్రభృతుల జీవితాలు ఇందుకు నిదర్శనములు. సర్కారు జిల్లాలలో సారస్వతసేవకు తమజీవితాలను అంకితము జేసిన మహాశయులలో అత్యధిక సంఖ్యాకులు రాజకీయాలతో ప్రమేయము కలిగించుకోలేదు. అందువలన అచ్చట రాజకీయ కార్యకర్తలు సారస్వతోపాసకులు విడివిడిగా కృషిజేయుట జరిగినది. కాని తెలంగాణములో ఇదిసాధ్యము కాని, సంభవము కాని కాలేదు. ఇక్కడిప్రజల మాతృభాషను అణచివేయుటయే అప్పటి ప్రభుత్వముయొక్క ముఖ్యోద్దేశమై యుండెను. కేవల సారస్వతోద్యమము, అను మాటకు అవకాశములేని పరిస్థితులను ఇక్కడిప్రభుత్వము కలిగించినది. గ్రంథాలయాల స్థాపనయే బహుదుస్తర కార్యముగా నుండెను. వీని నిర్వాహణ బాధ్యతను వహించిన కార్యకర్తలు ఎన్నియో ఇబ్బందులకు గురి చేయబడిరి. సారస్వత సమావేశాలపైనగూడ అనేక విధాలైన నిర్బంధాలు ప్రయోగింపబడి యుండెను. ప్రజల మాతృభాషల వ్యాప్తికి ఏ కొంచము అవకాశ మిచ్చినప్పటికిని అందువల్ల స్వతంత్ర భావాలు వ్యాప్తిజెంది రాజకీయముగా తమ కొంప మునిగిపోవు నను దృఢనిశ్చయముతో కవి సమ్మేళనాలు, సారస్వత సభల యెడ గూడ ఇక్కడి ప్రభుత్వము నిర్బంధ విధానము ననుసరించినది. ఏ చిన్న సమావేశము చేయదలచి నప్పటికిని ప్రభుత్వము యొక్క అనుమతి అవసరమై యుండెను. ఈ అనుమతి మిక్కిలి దుర్లభమై యుండెను. ఈ వాగ్బంధన శాసనము యొక్క పైశాచిక తాండవము వలన రాజకీయ కార్యకర్తలు, సారస్వతోపాసకులు విడివిడి వర్గాలుగా నైనను చీలిపోయి పనిజేయు నవకాశమైనను దొరకలేదిక్కడ. సమావేశ

స్వాతంత్ర్యము, వాక్స్వాతంత్ర్యము, రచనాస్వాతంత్ర్యము హైదరాబాదీయు లందరియొక్క ముఖ్యాశయమై యుండెను. ఈ యాశయము కొరకై ప్రతివారును కృషిజేసియుండిరి. ఈ కృషి ప్రభావము సారస్వతరంగమున కూడ ప్రత్యక్ష మగుచున్నది.

విజయనగర సామ్రాజ్య పతనము తరువాత వీరేశలింగము పంతులుగారివరకు తెలుగుభాషలో జరిగిన సారస్వతకృషి స్వల్పమైన దనియే చెప్పవచ్చును. ఈ కాలములో సమస్తాంధ్ర దేశమునందలి సారస్వతమునకును గ్రహణము పట్టినదని చెప్పిన యతిశయోక్తి కాజాలదు. ఈ రాహుకేతువుల పీడనుండి తెలుగుదేశమును విముక్తి గావించి, తెలుగుతోటలో క్రొత్తపాదులను నిర్మించిన మార్గదర్శి వీరేశలింగము పంతులు. వీరేశలింగము సంస్కృతాంధ్రములు చక్కగా పఠించి, ఆంగ్లసారస్వతపఠనముచే ప్రభావితుడైన ఉపజ్ఞాశాలి. ఆయన సారస్వత క్షేత్రమున అడుగుబెట్టిన సమయమున తెలుగుదేశమున రెండు ముఖ్యమైన విద్యాధిక వర్గాలు ఏర్పడియుండెను. మొదటివారు సంస్కృత పండితులు, రెండవవారు ఆంగ్లవిద్వాంసులు. ఈ యిరు పక్షాలమధ్య సరియైన సమన్వయము లేకుండెను. ఉభయపక్షాలకు కూడ తెలుగుతల్లిమీదఏమంతప్రేమయుండియుండలేదు.ఆంధ్రభాషాభివృద్ధికై కృషిజేయవలెననుపట్టుదల వారికిలేకుండెను. ఈ పరిస్థితులలో తెలుగు దేశమున శ్రీవీరేశలింగము తన పాంచజన్యమునుపూరించెను. ఆంగ్లభాషద్వారా విద్యాభ్యాసము గావించి, ఆ భాషలోగల వివిధ వాఙ్మయ విశేషములను చవిజూచిన తెలుగువారిని ఆయన ఆంధ్రభాషా పునరోద్ధరణము చక్కగా ఆకర్షించినది. కేవల సారస్వత కృషికై హైదారాబాదులోగల నిర్బంధాలు బ్రిటీషు ఇండియాలో లేకపోవుటవలన ఒక్కమారుగా తెలుగుదేశమునందు సారస్వతోద్యమము వెల్లువయై ఉప్పొంగినది, ప్రభుత్వోద్యోగాల యందుండు విద్యాధికులు కూడ ఈమహాప్రవాహమునందు స్నానముచేసి, కలము కసరత్తులను గావించినారు.

హైదరాబాదులోని పరిస్థితులు మరొకవిధముగా నుండెను. ఊరూర సంస్కృతాంధ్ర పండితులున్నప్పటికి, వారు పరస్పరము సమావేశమై బాహ్యప్రపంచముతో సంబంధము కలిగించుకొను నవకాశము లేకుండెను. మదరాసు విశ్వవిద్యాలయమున ప్రాంతీయభాషలకు స్థానమీయబడినందువలన బ్రిటీషు ఇండియాలోని ఆంగ్ల విద్యాధికులకు తమ మాతృభాషలతో పరిచయ మేర్పడియుండెను. హైద్రాబాదు రాష్ట్రమున రాజభాష ఉరుదూ; విద్యావిధానమంతయు ప్రాథమిక తరగతులనుండి విశ్వ విద్యాలయ తరగతులవరకు ఉరుదూద్వారా జరుపుచు, యే యితర రాష్ట్రములలో లేని క్రొత్త విద్యాపద్ధతి హైదరాబాదు ప్రజల నెత్తిమీద రుద్దబడినది. ఉద్యోగములు మొదలైన ప్రభుత్వ కరుణాకటాక్షములు గూడ నూటికి తొమ్మిదిమంది లేని అల్పసంఖ్యాకులమీదనే ప్రసరించినందువలన ఉరుదూ ద్వారానైనను ఉన్నతవిద్య నభ్యసించవలెనను అపేక్ష ప్రజలలో కలుగలేదు; ఇందుకుతోడు ప్రజాసామాన్యముయొక్క ఆర్థిక దారిద్ర్యమును వృద్ధి చేసినది. ఈ విధముగా సమస్త భారత మహాసముద్రములో హైదరాబాదు రాష్ట్ర మొక ప్రత్యేకద్వీపముగా సిద్ధమై అందు నివసించు ప్రజలను నాగరకప్రపంచమునుండి వేరుచేసినది. తత్ఫలితముగా గతశతాబ్దాంతమునుండి ఈ శతాబ్దాంతమువరకు హైదరాబాదులోని కొద్దిమంది విద్యావంతులలో రెండు ప్రస్ఫుటమైన వర్గా లేర్పడియుండెను. పల్లెటూళ్ళలో నాని వాసోదైన్యమునకు గురియై కృశించుచుండిన సంస్కృతపండితులు, ఆంధ్రకవులు మొదటివర్గము. ప్రభుత్వ వ్యవహారాల కొరకు కొలదియో గొప్పయో ఉరుదూభాషా ప్రావీణ్యము, దానికి తోడు ఫార్సీభాషా పరిచయమును అలవరచుకొన్న లౌకికులు రెండవ వర్గము.

ఈ సందర్భమున ఇంకొక ముఖ్యవిషయముగూడ గమనించవలెను. ఆంగ్లభాష ఒక మహాసముద్రమువంటిది. ప్రపంచ విజ్ఞానభాండారమునకు ప్రవేశము కలుగజేయు తాళముచెవి ఆంగ్లభాష. పాఠకుల నుత్తేజితులనుజేయు సామర్థ్యము ఆంగ్లభాషకు కలదు. కాని ఉరుదూ

భాష ఇట్టిది కాదు. ఉరుదూ వయఃపరిమాణము మూడునుండి నాలుగు వందల సంవత్సరాలకు మించియుండదు. ఉరుదూ కవిత్వము గోలకొండ, బిజాపూరు రాజధానులందు పదహారవ శతాబ్దముయొక్క చివరను, పది హేడవ శతాబ్దియొక్క ఆదియందును, ప్రారంభమైనది. ఉరుదూ సార స్వతమునకు శృంగార కవిత్వము, ప్రబంధ పోకడలు, సూఫీతత్వ ప్రతి పాదకమైన సాహిత్యము ప్రధాన లక్షణములు. కావున ఈ ఉరుదూ సార స్వతమునకు పఠితలను ఆంగ్లభాషవలె ఉత్తేజితులనుచేసి, విజ్ఞానము ప్రసాదించు సామర్థ్యము లేనందువలన, ఇది చెప్పదగిన గొప్ప పరిణామా లను ప్రాంతీయ భాషలలో కలుగ జేయలేకపోయినది.

హైద్రాబాదు రాష్ట్రములోని తెలుగుసీమవంక తమ దృష్టిని ప్రసరించి ఆధునిక యుగమున ఇక్కడి సారస్వతోద్యమమునకు నిజమైన పునాదులు వేసిన వారు స్వర్గీయ శ్రీ కొమఱ్ఱాజు వేంకటలక్ష్మణరావు గారు. శ్రీ వేంకటలక్ష్మణరావుగారు మహారాష్ట్ర దేశముతోను, భాషతోను గాఢమైన సంబంధము, పరిచయము కలిగిన విద్వాన్మ ణులు. చరిత్ర పరిశోధన, విజ్ఞానప్రచారము వారి ఆశయాలై యుండెను. ఈ ప్రత్యేక ఆశయాలు కలిగిన లక్ష్మణరావుగారు తెలంగాణ క్షేత్ర ములో నాటిన సాహిత్యవృక్షము, వానికి అనుగుణమైన ఫలములనే లభింపజేసినది. ఈ శతాబ్దారంభమున హైద్రాబాదు రాష్ట్రమునందు వారు గ్రంథాలయోద్యమ రూపమున భాషాప్రచారము ప్రారంభించిరి. హైదాబాదులోని శ్రీ కృష్ణదేవరాయాంధ్ర భాషానిలయము(1901), హనుమకొండలోని రాజరాజనరేంద్ర భాషానిలయము (1904) ల స్థాప నకు లక్ష్మణరావుగారి కృషి, ప్రోత్సాహములే ముఖ్యకారణములు. లక్ష్మణరావుగారు తమ విజ్ఞానచంద్రికాగ్రంథమండలిని 1900 వ సంవత్స రమునందే స్థాపించిరి. ఈ గ్రంథమండలి మొదటి నాలుగు ప్రచురణ ములు హైదాబాదు నుండియే వెలువడినవి. తరువాత 1908 సంవత్స రమున విజ్ఞానచంద్రికా గ్రంథమండలి కార్యాలయమును హైద్రాబాదు నుండి మార్చుట జరిగినది. లక్ష్మణరావుగారు చూపించిన మార్గమున హైద్రాబాదు రాష్ట్రమందు ఆంధ్రవాఙ్మయరథము నడిపించుటకు

నడుము గట్టిన సారథి మాడపాటి హనుమంతరావు పంతులుగారు. ఒక్క వాఙ్మయోద్యమముకే కాక రాజకీయోద్యమము మొదలైన ఇతర ఉద్యమాలకుకూడ మార్గదర్శకులు శ్రీ హనుమంతరావుగారే. భారత స్వాతంత్ర్యోద్యమ చరిత్రలో కొందరి మహాసీయుల జీవితాలను పరిశీలించినపుడు మన దేశము పరాధీన దేశము కాకుండినచో, వారు రాజకీయ రంగమున అడుగు బెట్టక, విజ్ఞానప్రపంచమునందు మాత్రమే విహరించెడి వారని విస్పష్టము కాగలదు. ఇట్టి శ్రేణిలో చేర్పదగిన వారు శ్రీ హనుమంతరావు పంతులుగారు. వీరు హైద్రాబాదురాష్ట్రము నందుగాక మరొక ప్రాంతమున జన్మించియుండినచో, తమ జీవితమును సాహిత్యవ్యవసాయమునకు, విద్యావ్యాప్తికి పూర్తిగా వినియోగించెడి వారు. హైద్రాబాదు రాష్ట్రములోని ప్రత్యేకపరిస్థితులే వారి ప్రజాహిత జీవనమునకు రాజకీయవాసన కలిగించినవి. హనుమంతరావుగారు ఇంగ్లీషు, ఉరుదూ, ఫార్సీభాషలయందు ప్రవీణులు; లక్ష్మణరాయ సాహచర్యముచే ప్రభావితులు. తెలంగాణ పరిస్థితులను చక్కగా అవగాహన చేసుకొనిన ఆంధ్రభాషాప్రియులు. వారు దేశభాషలపైన ప్రభుత్వమునకుగల సవతి తల్లి ప్రేమను గమనించిరి. ఆంధ్రచరిత్ర కుపయుక్తములుగాగల అనేక శాసనములు యూరూర పడియుండుటను తిలకించిరి. తాటియాకు గ్రంథాలు వేనవేలుగా జీర్ణించిపోవుట పరికించిరి. నాగరిక జీవితసౌధమునకు ఉరుదూభాషయే సింహద్వారముగా భావింప బడుట నవలోకించిరి. పల్లెలలో అజ్ఞాతవాసము చేయుచున్న కవి పండితులమెడ ఒకమారు తమ దృక్కులను ప్రసరించిరి. ఈ పరిస్థితులలో ఆంధ్రభాషోద్ధరణకు గ్రంథాలయాలే ముఖ్యసాధనములని గ్రహించి జిల్లాలలో విరివిగా గ్రంథాలయాలను స్థాపించుట ద్వారా భాషాప్రచారమును గావించిరి. కొంత కాలమునుండి నిద్రావస్థలోనున్న ఆంధ్రులను ఈ గ్రంథాలయోద్యమము మేలుకొలిపినది. గ్రంథాలయ సమావేశాలు, వార్షికోత్సవాలు, వాఙ్మయప్రదర్శనములు రచయితలలో ఉత్సాహమును పురికొలుపుటకు చక్కగా తోడుపడినవి. యువకు లనేకులు సాహిత్యసేవకు కంకణబద్ధులైనారు.

గ్రంథమాలలు, పత్రికలు బయలుదేరి, భాషాప్రచారము ప్రారంభించినవి. శ్రీ సురవరము ప్రతాపరెడ్డిగారివంటి ఆంగ్లవిద్యాధికులు జీవితములో ఆర్థికముగా అభివృద్ధికిరాగల అనేక అవకాశాలను జారవిడుచుకొని సాహిత్యసేవకు, భాషాప్రచారమునకు, పత్రికారచనద్వారా దేశసేవకు తమ జీవితమును అంకితము గావించిరి. తెలంగాణలో ప్రజాభిప్రాయమును దిద్దితీర్చుట యందు, నిర్భయముగా అభిప్రాయాలు ప్రకటించి ప్రజలకు అండగానిలిచిన గౌరవము గోలకొండ పత్రికకు యియ్యవలసి యున్నది.

హనుమంతరావుగారు స్వయముగా చక్కనిరచయితలు. తెలుగు భాషలో వ్యాసకర్తలు ఈ నాటికిని మిక్కిలి అరుదుగానున్నారు. చక్కని- చిక్కని వచన శైలిలో విషయ పరిపూర్ణతగల వ్యాసములను వ్రాయ సమర్థులైన కొద్దిమంది ఆంధ్ర రచయితలలో హనుమంతరావు గారికి ప్రత్యేకమైన స్థానముగలదు. బంకించంద్ర ఛటర్జీ వ్రాసిన ఆనందమఠమను నవలకు తెలుగుఅనువాదము; గ్యారీబాల్డీ జీవితచరిత్ర; రోమకసామ్రాజ్యచరిత్ర; శ్రీ చింతామణిరావు వైద్యాగారి "ఎపిక్ ఇండియా" అను ఆంగ్లగ్రంథములకు "ఖ్యాత కాలపు హిందూ ఆర్యులు"ను తెలుగు పరివర్తనములు హనుమంతరావుగారి తొలిరచనలు. ఈ రచనలు హనుమంతరావుగారి ఆశయాలు, వారిమీద లక్ష్మణరావుగారి ప్రభావము స్పష్టముగా తెలుపుచున్నవి. తెలుగు భాషలో మంచి వచన గ్రంథములు లేకపోవుటచేత, ఆలోటునుదీర్చవలెనన్నది మొదటియాశయము. ఆంగ్ల, వంగ, మహారాష్ట్రాది ఆంధ్రేతర వాఙ్మయాలలో జరుగుచున్న సాహిత్య ప్రచారమునుజూచి, ఆ విధముగానే మన భాషలో గూడ చరిత్ర, విజ్ఞానము మొదలైన విషయాలనుగూర్చి గ్రంథరచన చేయవలయుననునది రెండవ ఆశయము. ఆంగ్లాది పాశ్చాత్య భాషల యందలి నూతన వాఙ్మయరీతులను, విజ్ఞానమును తెలుగులో దిగుమతి చేయవలయుననునది, మూడవఆశయము. నేడు హనుమంతరావుగారు రాజకీయముగా అస్త్రసన్యాసము గావించినప్పటికి ఇట్టి ఆశయాలతో సాహిత్యసేవ కావించుచునేయున్నారు. లక్ష్మణరావుగారి

మరణము తరువాత విజ్ఞానచంద్రికా గ్రంథమండలి ఆగిపోయి
నది. గ్రంథమండలి అంతర్ధానముతోపాటు, తెలుగులో విజ్ఞాన
వాఙ్మయప్రకటన ప్రయత్నాలు సన్నగిల్లినవి. తెలంగాణముననేకాక
సమగ్రాంధ్రదేశమున జరిగిన సాహిత్యకృషిని సమీక్షించినచో మన
భాషలో వివిధ విషయాలనుగురించి విజ్ఞానమును ప్రసాదించగల
గ్రంథజాలము మిక్కిలి తక్కువయనియు, మహారాష్ట్ర, వంగ, హిందీ
భాషలతో పోల్చినప్పుడు మనము చాలా వెనుకబడి యున్నామనియు
ఒప్పుకొనకతప్పదు. ఇది హనుమంతరావుగారికి హృదయవేదన
కలిగించినది. ఈ లోటు నివారించుటకే వారు ఆంధ్ర చంద్రికాగ్రంథ
మాలను స్థాపించిరి. ఆ గ్రంథమాలయొక్క సకలవ్యవహారములను
తామే నెరవేర్చుచు గ్రంథప్రకటన గావించుచున్నారు. ఇప్పటివరకీ
గ్రంథమాలలో విస్మృతసామ్రాజ్యములు, ఆంధ్రోద్యమచరిత్ర
రెండు సంపుటములు, ఆంధ్ర సాహిత్యచరిత్ర సంగ్రహము, ప్రాచీ
నాంధ్రనగరములు, రాజకీయ పరిజ్ఞానము, అను పుస్తకాలు వెలు
వడినవి. త్వరలోనే ఆర్థిక, భౌతికవిజ్ఞానములగూర్చి గ్రంథములు కొన్ని
వెలువడనున్నవి. చారిత్రక దృక్పథము, విజ్ఞాన వాఙ్మయ ప్రచారము
అను హనుమంతరావుగారి ముఖ్యాశయములు ఈ గ్రంథమాల
ప్రచురణములలో ప్రతిబింబితములగుచున్నవి.

తెలుగు భాషలో హనుమంతరావుగారికి ప్రత్యేక విశిష్ట
స్థానము నీయగలిగినది వారి కథానికారచన. ఆధునిక ఆంధ్రవాఙ్మయ
మున కథానికా రచనకు మార్గదర్శకులైన కీర్తి గౌరవములు హను
మంతరావుగారికి చెందవలసియున్నవి. సుమారు నలుబది సంవత్సరాల
క్రింద కృష్ణాపత్రికలో వీరు వరుసగా 13 కథానికలను ప్రచురించి
ఆంధ్ర కథావీధికి త్రోవజూపించియున్నారు.

ఇది యిట్లుండగా శ్రీ లక్ష్మణరావుగారు చూపించిన మార్గాన
హనుమంతరావుగారొక గొప్ప సారస్వతోద్యమమునకు దృఢమైన
పునాదుల నేర్పరచిరి. ఇతర ప్రాంతాల సారస్వత కృషిని తెలంగాణ
సారస్వతోద్యమముతో పోల్చినప్పుడు కొన్ని ప్రత్యేకతలు కన్పట్టు

చున్నవి. తెలంగాణములో సారస్వతకృషి ఒకనిర్మాణాత్మక ఉద్యమముగా కొనసాగినది. ఇతర ప్రాంతాలలో సారస్వత కృషి వ్యక్తులను ఆశ్రయించినది. తెలంగాణా సారస్వత కృషి ప్రజలను మేలు కొలుపు ఒక మహోద్యమముగా సంస్థలను ఆశ్రయించి కొనసాగినది.

## పండితకవులు

తెలంగాణములో కవులయొక్కయు పండితుల యొక్కయు కొరత ఎన్నడు లేకుండెను. ప్రచారము, ప్రకటనము ఇక్కడి ప్రత్యేక పరిస్థితులవలన లోపించినందున నివురుగప్పిన నిప్పువలె కవులు, పండితులు దాగుకొనియుండిరి. స్థాలీపులాక న్యాయముగా ఈసందర్భములో వీరిని కొందరిని ప్రశంసించుట అవసరము. శ్రీ వెల్లాల సదాశివ శాస్త్రులవారు కొల్హాపుర సంస్థానవాస్తవ్యులు; బహుగ్రంథకర్తలు; మహాపండితులు. సంస్కృతములో చంపువులు, శాస్త్ర చర్చలు కావించిన చాలా గొప్పవైయాకరణి. ఈయన తెలుగులో చంద్రికా పరిణయమునకు వ్యాఖ్యాత. వీరి రచనలలో పేర్కొన తగినవి, ఆంధ్రుల చరిత్ర విమర్శనము; నరస భూపాలీయమును గూర్చి కావ్యాలంకార సంగ్రహమను తెలుగు వచన గ్రంథమును; నామిరెడ్డి చరిత్ర (శాసనములపై చరిత్ర) అనునవి. ఈ పండితశ్రేణిలో పేర్కొనదగిన మరొకరు శ్రీ బుక్కపట్నము శ్రీనివాసాచార్యులవారు. వీరిది విద్వత్కవి కుటుంబము. ఎనిమిది తరములుగా వీరి వంశమువారు కవులు. సుప్రసిద్ధులైన కిరీటి వేంకటాచార్యులవారు వీరి పూర్వులలో నొకరు. శ్రీనివాసాచార్యులవారు తమ ఏడవ సంవత్సరమునుండియే కవిత్వము జెప్ప నేర్చి, పదునైదవయేట, బాలకవి బిరుదాంకితులైరి. తరువాత మైసూరు సంస్థానాస్థానమందు బాలసరస్వతి బిరుదమందిరి. నవద్వీపములో తర్కతీర్థ బిరుదమందిరి. ఉత్తర భారతమందలి దర్భాంగ, జోధ్పూరు, గవాలియారు, ఇందోరు, ధారానగరు, జమ్మూ మొదలగు అనేక సంస్థానాలలో దిగ్విజయము గావించినారు. ప్రాకృతములు, సంస్కృతము, ఆంధ్రము అష్టభాషలలో అనువుగా శతఘంట కవనము చేయువారు. మద్రాసు, కడప, ప్రొద్దుటూరు, బనగనపల్లి, పెనుగొండ,

తాడిపత్రి, సురపురము మొదలగు స్థలములములో అవధానములు గావించినారు. వీరు బహు గ్రంథకర్తలు. రచనలు విశేషముగా సంస్కృతమున నున్నవి. వీరి కుమారులైన జాతక విద్వన్మణి వేంకటాచార్యుల వద్ద వీరి గ్రంథాలు కలవు. ఈ వేంకటాచార్యులవారి నెరుగని పండితులు, కవులు ఆంధ్రదేశమున లేరు. ఆంధ్రనాటక పితామహులగు ధర్మవరము కృష్ణమాచార్యులవారును, ఉత్తర హిందుస్థాన హిందూసంస్థాన కవీశ్వరులును, వీరిని ప్రశంసించిరి. శ్రీ తిరుపతి వెంకటకవులు వీరిని కొనియాడుచు పద్యములను వ్రాసిరి.

హిందూ, మదాసుమేలు, స్టాండర్డువంటి ఆంగ్లపత్రికలు వీరి ఆశుకవితనుగాంచి అద్భుతపడి అనేకరీతులుగా స్తుతించిరి. మైసూరులోని వైష్ణవపీఠమునకు అధిపతులుగా వెళ్ళిన పరకాలస్వాములవారు గద్వాల వాస్తవ్యులు. గొప్ప సంస్కృతాంధ్ర పండితులు, శతాధిక గ్రంథకర్తలు. గద్వాల వాస్తవ్యులేయైన పుల్లగుమ్మి వెంకటాచార్యులవారు గొప్ప వైయాకరుణులు, సంస్కృతాంధ్రరచయితలు. అత్కూరి మల్లికార్జున శాస్త్రిగారు రాయచూరు వాస్తవ్యులు, శతావధానులు. గణితశాస్త్రమున ఎన్నికోట్ల సంఖ్యలైనను నోటితో లెక్కించి చెప్పగల సమర్థులు. చాలాగొప్ప జ్యోతిశ్శాస్త్రవేత్తలు. వట్టెము వాస్తవ్యులగు పాపకవి తెనుగుకవి. వనపర్తివాస్తవ్యులగు విశ్రాల సోదరులు గొప్ప పండితకవులు. కర్ణమడకల అనంతాచార్యులవారు గద్వాల ఆస్థానపండితులుగా నుండిరి. న్యాయ, వేద, వేదాంత, వ్యాకరణ, మీమాంస, సాహిత్యములందు గొప్పప్రవీణులు. కాశీనుండి శివకుమార పండితులవారు గద్వాలకువచ్చి అనంతాచార్యులవారు లేరని విని, తమ పాండిత్యప్రకాశమునకై సభను జయించుటకు ప్రభుల యాజ్ఞనుబొంది ఈ సభలో తమను జయించువారు లేరని శపథము చేసి, అందరిని ఓడించిరి. తరువాత రాజుగారు అనంతాచార్యులవారిని పిలిపించిరి. వారు వీరి వాదమును ఒక్క పూర్వపక్షము ఖండించినంతనే శివకుమార పండితులు, ఇది అనంతాచార్యులవారికి దప్ప మరొకరికి సాధ్యముకాదని తెలిపిరట. శ్రీ పత్రి విశ్వేశ్వరశాస్త్రిగారు చక్కని

కవిత్వము చెప్పగల గొప్ప పండితులు. రామాయణ సంగ్రహము వారి రచనలలో పేర్కొనదగినది. ప్రాస్తావికముగా వీరు చెప్పినపద్యములు మనోహరమైనవి. కొల్లాపురమునుండి వెళ్ళిపోవలెనను ఉద్దేశమును ప్రకటించుచు, వెళ్ళిపోవుటకుముందుగా ఆశువుగాచెప్పిన-

"స్థానబలంబునన్ హృదయసార మెరుంగని దుష్టవంశ సం
తానము విఱ్ఱవీగెడు కతాన పరస్పరఘర్షజాత వై
శ్వానర విస్ఫులింగములు బర్వి వనంబ ఖిలంబు గాల్చెడున్
కాన దొలంగు మీ సుఖము గాంచుమి చందన! లోకనందనా!"

అనుపద్యము పేర్కొనదగినది. గోపాలపేట రామచంద్రాచార్యులవారు శతావధానులు, ఆనందరామాయణ ఆంధ్రగ్రంథకర్త. మహాభక్తవిజయ గ్రంథకర్త మందడి వేంకటకృష్ణకవి వనపర్తి వాస్తవ్యులు-చక్కని కవులు. దివ్యవాణిపత్రికా సంపాదకులై, సనాతనధర్మ ప్రచారమునకు కంకణము గట్టిన చివుకుల అప్పయ్యశాస్త్రిగారు సికింద్రాబాదునుండి గర్గభాగవతాది బహుగ్రంథములను వ్రాసి ప్రకటించిరి.

రెండు సంవత్సరాల క్రింద గతించిన శ్రీ చిదిరెమఠము వీరభద్రశర్మగారు నల్లగొండ జిల్లా చర్లపల్లివాస్తవ్యులు. కాశిలో వీరొక పీఠమునకు అధిపతులైనారుకూడ. వేదతీర్థ, కావ్యతీర్థ,స్మృతితీర్థ, ధర్మాచార్య, సాహిత్యవిశారద, మున్నగు బిరుదాంకితులు, మహాశాస్త్రి, కర్ణాటక, సంస్కృతాంధ్రములు బాగుగా తెలిసి కవిత్వము చెప్పగల సమర్థులు; మంచి విమర్శకులు; ప్రామాణికులైన పండితులు; వక్తలు.

వీరందరు పాతిక శతాబ్దములో గతించినారు. ఇప్పటికి తెలంగాణ జిల్లాలలో వివిధశాస్త్ర పరిజ్ఞాతలు, ఉద్దండ పండితులెందరో కలరు. వీరిలో వట్టెము నరసింహశాస్త్రిగారు, ప్రత్యేకముగా పేర్కొనదగినవారు. వీరు గొప్ప వైయాకరణి. శ్రీ అయితమురాజు కొండల్ రావుగారు బహు భాషావిశారదులు. ప్రభుత్వ విద్యాశాఖ నుండి ఉపకారవేతనము పొంది, హైద్రాబాదులో నివసించుచున్నారు. సంస్కృతాంధ్రాంగ్లములందేగాక, ఉరుదూ, ఫార్సీ, అరబ్బీ, కర్ణాటాది

బహు భాషలయందు పాండిత్యము గడించి, ఉరుదూ, తెలుగు నిఘంటువును వ్రాసిరి. ఈ పండితులలో వక్తలు, హాస్యరసపూరిత ముగ సంభాషించగల నేర్పరులుకూడ కలరు. మహబూబ్ నగరములోని అచ్చంపేట వాస్తవ్యులు గొప్ప వైయాకరణులునగు నరసింగయ్యగారు ఇట్టి చమత్కార సంభాషణలో నేర్పరులు. వీరిని ఒకరు తాంబూలము వేసుకొమ్మని కోరగా, తాము పతితద్విజులమని చెప్పి, తమకు దంత ములు లేకపోవుటను శ్లేషించిరి. గద్వాలలో ఆస్థాన కవీశ్వరులుగా నుండి గతించిన శ్రీ గాడేపల్లి వీరరాఘవశాస్త్రిగారు అద్వితీయమైన ధార, గొప్ప ప్రతిభ గలిగిన ఉదండ కవీశ్వరులు. వీరి అవధానములు సమస్యాపూరణములు, శ్రీనాథ, తెనాలి రామకృష్ణాది పూర్వకవీశ్వ రులను స్ఫురింప జేయునవియై యున్నవి. వీరి కవిత్వము ఇతరుల కవి త్వమువలె సులభమైనదే యని ఒకరు ఆక్షేపించి నప్పుడు- వీరు,

"సులభంబైన సమానమాయెనట దిక్శుద్ధాంత కాంతా నిర
ర్గళ లావణ్యమయ ప్రభావ విహవత్కల్లోల మాలాతి ని
ర్మల డిండీరకణాయ మానసు యశోరామా మనోహారి వా
గ్విల సద్భూషణు నస్మరుంగరొకో దేవీ ఎంతమాటాడె జూ.

అని యాశువుగా జెప్పిన ఎనిమిది పద్యములు వీరి నిరర్గళ కవితాధోరిణిని నిరూపించుచున్నవి, అనేక అవధానాలు గావించి దుష్కర ప్రాసలతో గూడిన వివిధసమస్యలను పూరించి వీరు సార స్వత జైత్రయాత్రను గావించిరి. ఒక సభలో 'పాండిత్య హీనాః కవయః' అని ఒకరెత్తిపొడిచి నప్పుడు, వీరు-

"వ్యాసుండన్న పురాణకర్త అతడా పాండిత్య హీనుండె కా
ళాసుండన్న మహాకవీంద్రు డతడా పాండిత్య హీనుండు వా
గ్వ్యాసంగుండగు భట్టబాణు డతడా పాండిత్య హీనుండు"
అని, యేబదిరెండు పాదముల శార్దూల వృత్తములో-
"ఈ స్త్రీ కీవు డీకొందువా ? నీ సంసారము గుట్టు
లో దలచి వందేయంచు వాకొందువా?"

అని ప్రశ్నించిరట. ఈ కవి అనేక సమస్యలను పూరించిరి-వానిలో ఉదాహరణకై—"దారము లేని హారము నుదారత నీ కెవ రిచ్చిరమ్మరో ?" అను సమస్యను-

"సారస గాత్రి యొక్కతె నిశాసమయంబున మంచి ముత్తెముల్
గూరిచి తా ధరించి తనుగూడెడు నాథు కవుంగిలింప జే
కూరెను గుర్తులవ్వి గని కోమలి కిట్లని రెల్ల నెచ్చెలుల్
దారములేని హారము నుదారత నీ కెవరిచ్చిరమ్మరో ?"

దీనికే పూర్వకవులు మరికొందరు పచ్చలాదారము లేని హార మనియు, మందారములేని హారమనియు పూర్తిచేసిరని చెప్పినప్పుడు వీరి పూరణములోని స్వారస్యము స్పష్టము కాగలదు. కవిశ్రేణిలో చేర్చదగిన మరొకరు కీ॥ శే॥ మాదిరాజు విశ్వనాథ రావుగారు- వారు అరబ్బీ, ఫార్సీ, ఉర్దూ, ఇంగ్లీషు, సంస్కృతాంధ్రాది బహుభాషా విశారదులు- ప్రస్తుతము హైద్రాబాదు ప్రభుత్వ శాఖలో ఉన్నతోద్యోగము నందున్న రావుగారు ఇటీవలనే కీర్తిశేషులైరి. ఈ ప్రాంతములో లక్ష్మణశాస్త్రిగారితో కలసి వీరు- కర్ణసుందరి యను నాటకమును, బిల్హణుని విక్రమాంక దేవచరిత్ర ప్రబంధమును తెనుగులో వ్రాసియున్నారు. విశ్వనాథ కవితా వ్యాసంగమును ఇతరులలో వ్యాప్తిజేయుటకు శ్రమించి, తాము ఇతరులతో జేయు పరస్పర ఉత్తరప్రత్యుత్తరములు గూడ పద్యరూపముననే జరుపుచు, ఒక కవిత్వ ఉద్యమమును కొల్లాపురములో లేవదీసిన స్నేహలతా కవితాసంఘ నిర్వాహకులు శ్రీ రామ సుబ్బారాయుడుగారు, ప్రత్యేకముగా ప్రశంసనీయులు. నల్లగొండ జిల్లాలో శ్రీ గవ్వా అమృతరెడ్డి, శ్రీ గంగుల 'శాయిరెడ్డిగార్లు మధుర కవిత్వమును వ్రాసినారు. శాయిరెడ్డిగారి కాపుబిడ్డ' చక్కని ఖండకావ్యముల సంపుటి.

ఈ విధముగా ఈ శతాబ్దాదియందు శ్రీ మాడపాటి హనుమంతరావుగారు నవీనపద్ధతుల ద్వారా సారస్వతోద్యమ వ్యాప్తికి కృషి జేయుచుండగా మరొకవంక విద్వత్కవిసింహములు సంస్థా

నాధీశ్వరుల ఆస్థానాలలో వీర విహారములు గావించినవి. ముఖ్యముగా వనపర్తి, ఆత్మకూరు, గద్వాల సంస్థానములు కవిపండిత పోషణకు ప్రసిద్ధిగాంచినవి. గద్వాల సంస్థానాధీశ్వరులు, కీర్తి శేషులునగు సీతారామ భూపాలుడు గావించినన్ని కవి పండిత సన్మానములు, యెన్నడు యే ఆస్థానమునందును జరుగలేదని బహుపండితుల అభిప్రాయమై యున్నది. రసికులు, భాషాపోషకులు, విద్యాప్రియులునగు ఆధునిక సంస్థానాధీశ్వరులలో వారు మున్నన్నదగినారు.

## నవయుగారంభము

ఈ శతాబ్దాదిలో శ్రీ హనుమంతరావుగారి పిలుపును అందుకొని భాషాసేవకు యువకు లనేకులు ముందుకువచ్చి పత్రికలద్వారా, గ్రంథాలయాలద్వారా, సారస్వత సభలద్వారా, గ్రంథమాలల ద్వారా, విశేషకృషిని గావించిరి. ఈ సందర్భములో శ్రీ సురవరం ప్రతాపరెడ్డిగారి నామము ప్రత్యేక ప్రశంసనీయము. శ్రీ సురవరము ప్రతాపరెడ్డిగారు బహుముఖముల వాఙ్మయసేవ గావించిన భాషా తపస్వి. ఆయనను రాజకీయనాయకుడుగా, పత్రికాసంపాదకుడుగా సకలాంధ్రదేశము గుర్తించినది. కవిగా, నాటకరచయితగా, కథకుడుగా, పరిశోధకుడుగా, పండితవర్యుడుగా ఆయన యావదాంధ్ర దేశఖ్యాతిని గాంచిరి. ప్రతాపరెడ్డి ఒకవ్యక్తిగాడు. ఒకమహాసంస్థ-ఎందరో రచయితలను వాఙ్మయరంగమునకు లాగుకొని వచ్చి, ముందుకు నెట్టినా డాయన— తెలంగాణమును మేలుకొలిపిన వైతాళికులలో ముఖ్యుడాయన. నీలగిరి, తెలుగుపత్రికలు, సుజాత యీ రాష్ట్రమున సారస్వత ప్రచారమునకు స్తుతిపాత్రమైన కృషి గావించినవి. నీలగిరి, నల్లగొండనుండి వెలువడినది. తెలుగుపత్రిక వరంగల్లు జిల్లా మానుకోట తాలూకాలోని ఇనుగుర్తి యను చిన్న గ్రామమునుండి ఒద్దిరాజు సీతారామచంద్రరావు, రాఘవ రంగారావు అను సోదరుల సంపాదకత్వమున వెలువడినది.

ఈ సోదరులు విశేష ప్రతిభావంతులు. అనేకవిధాలైన వాఙ్మయ నిర్మాణము చేయగలిగిన దక్షులు. జోడుగుఱ్ఱముల వంటి యీ

సోదరకవులు, ఏకాంకికలు, కథలు, నాటకములు, వ్యాసములు, విమర్శలు, పుంఖానుపుంఖముగా తెలుగు పత్రిక ద్వారా తెలంగాణమున ప్రకటించి, విశేష భాషాప్రచారము గావించిరి. ఆనాటి నీలగిరి, తెలుగుపత్రికల సంపుటాలను ఒకమారు పరిశీలించినచో, యువక ప్రతిభకు, అజ్ఞాతరచనలకు, యీ పత్రికలు యేవిధముగా దోహదము గావించినవో స్పష్టము కాగలదు.

శేషభట్టరు రామానుజాచార్యులవారు భావోద్వేగముతో కూడిన ఖండ కావ్యముల నెన్నింటినో రచించి, ఉత్తమ కవిశ్రేణిలో ప్రత్యేక స్థానముసంపాదించుకొనిరి. వీరు హాస్యరసాత్మక పద్యములు వ్రాయుటలో దిట్టలు; వీ రేశలింగకవి కంఠాభరణ గ్రంథమాలాధిపతులు. వీరి రచనలు సుజాత, తెలుగుపత్రిక, నీలగిరి పత్రికలలో ప్రకటితము లైనవి. వీరి రచనలు నేడు వారి గృహమున అజ్ఞాతవాసము చేయుచున్నవి. సుజాత, శ్రీ పి. యన్. శర్మగారి సంపాదకత్వమున హైదాబాదునుండి వెలువడినది. శ్రీ శర్మగారిప్పుడు హైదాబాదులో ఉన్నతోద్యోగము నందున్నారు. ఈ పత్రిక ఇప్పటి యువకులలో అపారమైనప్రభోధము కలుగజేసి, ఎందరో రచయితలను, కవులను ఉద్భవింపజేసినది. సుప్రసిద్ధులైన శ్రీ గుడిపాటి వేంకటాచలముగారి రచనలను మొట్టమొదటి సారిగా ప్రకటించిన గౌరవము సుజాత పత్రికకు యీయవలసియున్నది.

ఈ విధముగా హైద్రాబాదులో జరిగిన ప్రబోధఫలితముగా ఆధునిక సారస్వతమునకు తెలంగాణ క్షేత్రములో బీజా వాపన మైనది. ఎన్నియోపాదులు కల్పించబడినవి. ఆ పాదులలో ప్రభవించిన సాహిత్యవల్లి క్రొత్త క్రొత్త పూవులనేకము విరియబూచి కమ్మతావులను వెదజల్లినది.

యువకులు సారస్వత రంగమున నూతన మార్గముల నన్వేషింప సాగినారు. ఈ ఉద్యమము ఇనుపచట్టములో బిగింపబడిన కళాశాలలను గూడ కొంతవరకు కదలించినది. ఉన్నత విద్యనభ్యసించు యువకులు కొందరు సాహిత్యరంగమున ముందంజవేసిరి. వీరిలో కొందరిని

పేర్కొనుట యీ సందర్భమున అవసరమైయున్నది. నిజాంకళాశాలలో విద్యనభ్యసించుచున్న శ్రీ సిరిగూరి జయరావు ఇట్టి యువకులలో పేర్కొన దగినవారు. ఈయన తెలుగులో ఆధునిక పద్ధతిని ఉత్కృష్టమైన కవిత్వము వ్రాసినారు. తిక్కననుగూర్చి యీయన వ్రాసిన గేయము, తెలుగువారు నిద్దుర మేలుకొనవలెనని సీసపద్యములలో జేసిన ప్రబోధము, ఇతర సారస్వత వ్యాసములు తెలుగుసరస్వతికి మంచికానుకలు.

"ఒకవంక నాంగ్లేయ సుకుమారి యిచ్చగిం
పులతోడ వలపింప దలచుచుండ
మునుగులో దాగిలిమూత లాడుచు నుర్దు
భాషావనిత వలల్ బరచుచుండ
అప్సరోభామినినంచు సంస్కృతకాంత
పాలిండ్లు పొంగార పై బడంగ
తగుదునమ్మా యంచు వగలాడి గ్రామ్యంపు
గులుకు మిటారి తళ్కులు నటింప
హింది కన్యను పెండ్లాడుమీ యటంచు
పెద్దలందరు బలవంత పెట్ట నకట!

చిన్నతనముననుండి నెచ్చెలిగనున్న
తెలుగుకన్నియ ముద్దులు తీర్చు లెపుడొ.
చనుబాలు త్రాగు నా డనురాగ మొలుకంగ
అమ్మా యటంచు మాటాడునాడు
గోళికాయల నాడుకొనునాడు తగవు లా
టలలోన తిట్టులు పలుకునాడు
అత్తింటికేగిన క్రొత్తలో మరదలి
హాస్యోక్తులకు బదు లాడునాడు
మునలి ముత్తాత నీరసముగా వెడలిపో
యెద నంచు కడమాట వదలునాడు

చచ్చెనో, యెడతెరుంగదో, పిచ్చిపట్టి
రూపుమాసెనో అన్యభాషా పిశాచి
బొర యెటనుండి దాపురమాయె నీకు
తెలుగు కాపురమునకు పెద్ద తెగులువోలె."

శ్రీ జయరావు తరువాత ఐ. సి. యస్. పరీక్షలో విజయము పొంది, ఉన్నతోద్యోగము నందుండగా పిన్నవయసుననే మృత్యుదేవత ఆయనను కబళించినది. జయరావు వలెనే ఎన్నో ఆశలు గొలిపి అకాల మరణము వాతబడినవారు కోదాటి రామకృష్ణారావు. ఈయన కలము ఖండకావ్యరచనయందు, వ్యాసరచనయందు నిగ్గులు దీరినది. తెలుగు పత్రిక, సుజాత మొదలైన పత్రికలను ఈయన రచనలు అలంకరించినవి. ఇంచుమించుగా వీరిద్దరితో సమకాలికుడు శ్రీ మామునూరు నాగభూషణ రావు. ఈ కవికోకిలము కొంతకాలము తెలంగాణ సారస్వతోద్యాన వనమున మధురమధురముగా కూసి నేడు మౌనముద్రను వహించినది. చక్కని కవిత్వము వ్రాయుటే గాక, శ్రావ్యముగా పాడగల సమర్థు డీయన. సారస్వత చంద్రికా గ్రంథమాలను స్థాపించి యీయన 'వెన్నె లకుప్పలను' మనోహర ఖండకావ్య సంపుటినొక దానిని ప్రకటించినారు. ఈ సంపుటి ఈయన అభిరుచి ప్రాశస్త్యమునకు, రసహృదయమునకు ఉజ్వలోదాహరణము. శ్రీ భండారు వీరరాజేశ్వరరావు యీకాలమున పేర్కొనవలసిన మరొక యువకవి. 'ఆర్ద్రపురుగు', 'పసిపాప'వంటి ఖండ కావ్యములు యీయనకు సకలాంధ్రదేశకవిమండలియందు ఉత్కృష్ట స్థానమొసగుచున్నవి. ఇదేకాలమున సారస్వతరంగమున ప్రవేశిం చిన మరొకవ్యక్తి శ్రీ ఉదయరాజు శేషగిరిరావు. ఈయన సంస్కృ తాంధ్రాంగ్ల అరబ్బీ పార్సీ మొదలైనబహుభాషలలో ప్రవీణుడు. చక్కని కవిత్వము వ్రాయగల ప్రతిభావంతుడు. 'మనోరమ' యను ఖండకావ్యము యీయన రచనలలో పేర్కొనదగినది. గార్లపాటి రాఘవరెడ్డి యీ యుగమునకు చెందిన మరొక విద్వత్కవీశ్వరుడు.

ఈ విధముగా ప్రతిభావంతమగు కవితా వ్యాసంగము ఒకవంక జరుగుచుండగా, మరొకవంక కథానికల రచనయందు తెలంగాణ యువ

కులు ముందుకు రాసాగిరి. ఇట్టి యువకులలో శ్రీ నందగిరి వేంకటరావు ముఖ్యుడు. ఈయన ఆనాటి పత్రికలలో అసంఖ్యాకములగు కథలను ప్రకటించినాడు. హైదాబాదులో జరిగిన మొదటి అఖిలాంధ్ర కథకుల సమావేశమునకు అధ్యక్షత వహించినాడు. నందగిరి చక్కని వ్యావహారిక భాషలో కథానికారచన చేయగలిన సమర్థుడు. స్త్రీ పురుష సంబంధ సమస్యలకు యీాయన కథానికలలో ప్రాధాన్యత కనబడుచుండును. సకలాంధ్ర కథకులలో మొదటి శ్రేణికి జేరదగిన కథకుడీయనయని చెప్పిన అతిశయోక్తి కాజాలదు. విద్వాంసులై, పరిశోధకులై, కథానిక రచన వంక తమ దృష్టి ప్రసరించినవారు సురవరము ప్రతాపరెడ్డి గారు. వీరి కథలు 'ప్రతాపరెడ్డి కథలు', అని పుస్తక రూపముగా ప్రకటింపబడినవి. ఈ కాలమున వచన రచనలు గావించిన వారిలో ముఖ్యులు నేడు హైదరాబాదుకు విద్యాశాఖామంత్రిగానున్న ప్రఖ్యాత ఆంధ్ర నాయకులు శ్రీ బూర్గుల రామకృష్ణారావు గారు. వీరు బహుభాషా విశారదులు, కవులు, విమర్శకులు, వక్తలు. ఇంగ్లీషులో 'గ్రే' వ్రాసిన ఎలిజీ మరియు ఉమర్ ఖయ్యాం రుబాయీాలను వీరు మనోహరమైన పద్యములలో ఆంధ్రీకరించి యున్నారు. వీరు ఫార్సీ వాఙ్మయ చరిత్ర, ఎంకి పాటలు మొదలైన ఆధునిక రచనలను గూర్చి వ్రాసిన వ్యాసములు మన తెలుగు విమర్శనమున అగ్రశ్రేణిలో నుండదగినవి. రామకృష్ణారావు గారు చరిత్ర పరిశోధకులుగూడ. అప్పకవి నివాసస్థానమును గూర్చిన చర్చలలో వీరు పాల్గొని, అప్పకవి తెలంగాణ ప్రాంతము వాడని వీరు నిరూపించియుండిరి.

శ్రీ మాడపాటి హనుమంతరావుగారికి సమకాలికులై హైద్రాబాదాంధ్రుల అభ్యుదయమునకై అపారమగు సేవ గావించినవారు శ్రీ ఆదిరాజు వీరభద్రరావు గారు. కీర్తిని కాంక్షింపక సేవయే ప్రధానముగా భావించినవారిలో వీరు అగ్రగణ్యులు. వీరు లక్ష్మణరావుగారి అనుచరులు, హనుమంతరావుపంతులుగారికి కుడిభుజమువంటివారు. హైదరాబాదులోని కృష్ణదేవరాయాంధ్రభాషానిలయము యొక్క పెంపు సొంపులకు కారణభూతులైన పెద్దలలో వీరు ముఖ్యులు.

యీ నిలయ రజతోత్సవ సంచికకు సంపాదకులై, దానిని సర్వాంగ సుందరముగా విజ్ఞానదాయకముగా సిద్ధముచేసియుండిరి. లక్ష్మణరాయ పరిశోధక మండలికి కార్యదర్శులై పెక్కుశాసనాలను అనేక చరిత్రాంశములను బహిరంగ పరచినారు. ఇంకను చరిత్రాత్మకములు, భాషా విషయకములు, విజ్ఞానదాయకములునగు వ్యాసము లనేకములను వ్రాసి, ఆంధ్ర వచనరచయితలందు విశిష్టమగు స్థానము నాక్రమించి యున్నారు. నేడు హైద్రాబాదు రాష్ట్రమందలి చారిత్రక ప్రదేశములు, చరిత్రపరిశోధన భాషావ్యవసాయము ఇంతయేల ఆంధ్రోద్యమము యొక్క యే విషయమునుగురించి యైనను సమగ్రవిజ్ఞానము గలిగినవారు శ్రీ వీరభద్రరావుగారనుటలో అతిశయోక్తి యేమియును లేదు. ప్రచ్ఛన్నముగా వీరు చేసిన భాషాసేవ యెంతయో కలదు. వీరి అనేక అముద్రితరచనలు కలవు. ముద్రితరచనలలో పేర్కొనదగినది ప్రాచీనాంధ్ర నగరము లను గ్రంథము.

ఈ కాలమున పత్రికలలో రచనలు గావించి, సభలలో ఉపన్యాసాలు జేసి, సంస్థల నిర్వహణబాధ్యత వహించి, సారస్వత సేవకు కృషిచేసిన విద్యాధికులలో శ్రీ గాడేపల్లి సూర్యప్రకాశ రావుగారు, శ్రీ సరిపెల్లి విశ్వనాథ శాస్త్రిగారు, శ్రీ ఇల్లిందల సీతారామరావు గారు, శ్రీ లోకనంది శంకరనారాయణరావుగారు మొదలయినవారు ముఖ్యులు. సాహిత్యరంగముననే కాక, కళారంగమున యీ కాలమున ప్రశంసనీయమగు సేవ జరిగినది. శ్రీ మార్చాల రామాచార్యులు గారు మంచి చిత్రకారులుగా పేరుపొందిరి. వీరి చిత్రములు 'సుజాత' మొదలయిన పత్రికలలో ప్రకటితమైనవి. నాట్యకళ అభివృద్ధికై యువకులు కొందరు నడుముకట్టి కళాసమితులను స్థాపించిరి. సికింద్రాబాదులోని 'జగదీశ నాట్యమండలి' వీనిలో యెన్నదగినది. ఈ నాట్యమండలిలో ముఖ్యపాత్రధారులు బుచ్చయ్యగారు. ఈ మండలివారు మద్రాసు, బెజవాడ, గుంటూరు, సింగరేణి, సికింద్రాబాదు మొదలయిన పట్టణాలలో నాటకాలు ఆడి మెప్పులు పొందిరి.

ఈ విధముగా ఆధునిక యుగమున అన్నిరంగములందు హైద్రాబాదాంధ్రులు ముందుకు వచ్చి కృషిసి గావించిరి. ఈ కృషికి పత్రికలు, గ్రంథమాలలు, గ్రంథాలయాలు, మిక్కిలి సహాయకారులైనవి

## సారస్వతోద్యమములు

ఈ రాష్ట్రమున మొదటి పత్రిక హితబోధిని. ఇది క్రీ. శ. 1913 లో మహబూబు నగరము నుండి శ్రీనివాస శర్మగారి సంపాదకత్వమున వెలువడినది. ఈ కాలముననే అవతరించి సేవజేసిన పత్రికలలో ఆంధ్రమాత, నీలగిరి, తెలుగు, గోలకొండ, శైవ ప్రచారిణి, మీజాన్, దివ్యవాణి, సుజాత, ఆంధ్రాభ్యుదయము, దేశబంధు, దక్కన్ కేసరి, పూలతోట, మద్యపాననిరోధక పత్రిక, తెలుగు తల్లి, ఆంధ్రకేసరి, విభూతి, పేర్కొనదగినవి. గ్రంథమాలలలో గోలకొండ, కిన్నర, దివ్యవాణీ సుకృతి ప్రాసాదము, మాతృభారతి, ఆంధ్రశ్రీ, కాకతీయ, పూలతోట, వీరేశలింగ కవి కంఠాభరణ, కృషిప్రచారిణి, శివధర్మగ్రంథమాల, విజ్ఞానప్రచారిణి, వేంకటేశ్వర, అణా, దేశోద్ధారక, ఆంధ్రకేసరి, సాహితీమేఖల, సాధనసమితి, కావ్యమాల, మొదలైనవానిని పేర్కొనవలసి యున్నది. సారస్వత సంస్థలలో విజ్ఞానవర్ధినీ పరిషత్తు, వైతాళికసమితి, ఆంధ్రవాఙ్మయ సేవాసమితి, కాకతీయ కళాసమితి, యెన్నదగిన సేవ గావించినవి. ఇవిగాక- గోలకొండ కవులసంచిక, కృష్ణదేవరాయల గ్రంథాలయ రజతోత్సవ సంచిక, శబ్దానుశాసనాంధ్రభాషా నిలయ రజతోత్సవసంచిక, పోతన వర్ధంతి సంచిక, హనుమంతరాయ షష్టిపూర్తిసంచిక మొదలైనవి స్థానికుల రచనలను యేరికూర్చి ప్రకటించినవి.

ఈ విధముగా జరుగుచుండిన సారస్వతసేవకు ప్రోత్సాహకరములైన మూడు ముఖ్యవిషయాలను ఇక్కడ పేర్కొనవలసి యున్నది. హైదరాబాదులో ఆంధ్రబాలికలకు మాతృభాషలో విద్యాభ్యాస సౌకర్యము గలిగించి, మహిళామణులలో ఆంధ్రసారస్వతాసక్తి కలిగించినసంస్థ హైదరాబాదు నారాయణగూడెములోని ఆంధ్రబాలికా

పాఠశాల. ఈ బాలికా పాఠశాలయందు విద్యాభ్యాసము గావించిన బాలికలు తరువాత విదుషీమణులుగా రచయిత్రులుగా ప్రఖ్యాతి గాంచినారు.

క్రీ. శ. 1940 వరకు హైదరాబాదలో తెలుగు దిన పత్రికను స్థాపించి నిర్వహించు ప్రయత్నములు అప్పటి ప్రభుత్వ నిర్బంధము వలన సాగలేదు. పత్రిక అనుమతి కొరకు ప్రముఖులు ప్రయత్నించి విఫలులైరి. కాని యెట్టకేలకు 1940సంవత్సరమున తెలంగాణ పత్రికను నిర్వహించుటకు అనుజ్ఞలభించినది. ఈ దిన పత్రికద్వారా ఇక్కడి సారస్వతోద్యమమునకు మంచిదోహదము కలిగినది. ఇదే సందర్భములో హైదరాబాదులో జరిగిన మరొక సంఘటన ను ప్రత్యేకముగా స్మరించవలసి యున్నది. హైదరాబాదులో ఆంధ్రోద్యమము గ్రంథాలయోద్యమముగా ప్రారంభమై యుండెను. కాని క్రమక్రమముగా ఈ ఉద్యమము రాజకీయ ఉద్యమముగా పరిణమించినది. అందుచేత తెలంగాణములోని ఆంధ్రులకొరకు మరొక సారస్వత సంస్థను స్థాపించు అవసరము కలిగెను.

## ఆంధ్ర సారస్వత పరిషత్తు

శ్రీ మాడపాటి హనుమంతరావు, శ్రీసురవరము ప్రతాపరెడ్డి మొదలైన పెద్దలు ఆంధ్ర సారస్వత పరిషత్తును స్థాపించిరి. ఇది యొక చారిత్రాత్మకమైన సంఘటన. ఆంధ్రదేశము నందలి ఇతర సారస్వత సంస్థలవలెగాక యీ పరిషత్తు ప్రత్యేక ఆదర్శాలతో ఆశయాలతో నిర్మాణాత్మక కార్యక్రమముతో అవతరించినది. ప్రజా సామాన్యమునందు భాషాప్రచారము గావించు ఉద్దేశముతో పరీక్షల నిర్వహణను సాధనగా తీసికొని ఈ పరిషత్తు కృషిని ప్రారంభించినది. వాగ్బంధన శాసనాది నిర్బంధముల వలన యీ పరిషత్తు కృషి ఆదిలో యెక్కువగా జరుగక పోయినప్పటికిని, పోలీసుచర్య ముగిసిన తరువాత ఇది తెలంగాణములో ఒక మహోద్యమముగా వ్యాప్తి జెందుచు, వేలకొలది ప్రజలను అక్షరాస్యులుగా జేయుచు, భాషాప్రచారము గావించుచున్నది. పరిషత్తు పక్షమున సంవత్సరము

నకు రెండు పర్యాయములు జరుగు పరీక్షలలో ఒక్కొక్క పరీక్షయందు ఆరువేల మంది అభ్యర్థులు పాల్గొనుచున్నారని చెప్పినచో, పరిషత్తు పరీక్షలు తెలంగాణ జిల్లాలలోని రెండువందల కేంద్రాలయందు జరుగుచున్నవని చెప్పినచో, పరిషత్తుకు నేడు రెండువందల శాఖలుకలవని చెప్పినచో; యీ ఉద్యమస్వరూపము మీరుకొంత ఊహించవచ్చును.

ఈ విధముగా తెలంగాణమున గత దశాబ్దమున ఒక మహోద్యమము ప్రారంభమై వ్యాపించుచున్నది. యువకులు, నూతన రచనల ద్వారా తెలుగు సరస్వతిని ఆరాధించుచున్నారు. పెద్దలు విజ్ఞాన వాఙ్మయ ప్రకటనకై కృషిజేయుచు యువకులను ప్రోత్సహించుచున్నారు. ఈ కాలమున వాఙ్మయసేవకు కటిబద్ధులైన యువకులలో కవులు, కథకులు, వ్యాసకర్తలు, గ్రంథకర్తలు అనేకులు కలరు.

ఈనాటి కవులలో పేరెన్నిక గన్నవారు శ్రీ వానమామలై వరదాచార్యులవారు. వీరిది విద్వత్కవి కుటుంబము. తండ్రిగారు గొప్పపండితులు, శాస్త్రవేత్తలు, సోదరులందరు పండితకవులు. శ్రీ వరదాచార్యులవారు తమ కావ్యపఠనముద్వారా ఎన్నివేల మందిగల సభనైనను రంజింపజేయగలరు. మధురమైన వారి కవిత్వమునకు శ్రావ్యమైన కంఠము వన్నె పెట్టుచున్నది. వీరి ఖండ కావ్యములు "మణిమాల" యను గ్రంథరూపమున ప్రకటితములైనవి. పోతన మహాకావ్యమును వీరు ఇటీవలనే రచించియున్నారు. ఈ గ్రంథము ప్రకటితమైనచో, ఆధునికాంధ్ర వాఙ్మయములలో దీనికొక ఉత్కృష్టస్థానము లభించగలదు.

దాశరథికృష్ణమాచార్యులు, యువకవి-కవిత్వములో యీయన పొగలిగినన్ని పోకడలు పోగలవారు ఆంధ్ర దేశములోనే మిక్కిలి తక్కువయని చెప్పవచ్చును. యువకుడైన యీయనకు ఉజ్వలమైన సారస్వత భవిష్యత్తుకలదు. అభ్యుదయ కవులలోనేగాక పండిత కవులలోకూడ దాశరథికి ప్రత్యేకస్థానముకలదు- 'అగ్నిధార, రుద్రవీణ' యను రెండు ఖండకావ్యసంపుటములుయీయన ప్రకటించియున్నారు. బెల్లంకొండ చంద్రమౌళిశాస్త్రి బహుముఖాలుగా లేఖినీవిన్యాసము.

చేయగలదక్షుడు- కవిత్వము, కథానిక రచన, ఏకాంకికారచన మొదలయిన వివిధ వాఙ్మయ వీధులలో యీాయన విహరించుచున్నారు. ఈ సందర్భమున చందూరు ప్రాంతమునందలి సాహితీ మేఖలవారి కృషి ప్రత్యేకప్రశంసనీయము. ఈ సాహితీమేఖల కవులందరు యువకులు. నిండుజవ్వనమున నున్నవారు. సంస్కృతాంధ్రములలోనేగాక ఆంగ్లభాషలోకూడ మంచిపరిచయముకలిగిన వారు. ఈకవులలో శ్రీ పులిజాల హనుమంతరావు, ధవళా శ్రీనివాసరావు, సిరిప్రగడ భార్గవరావు, ప్రత్యేకముగా సంస్మరణీయులు. "గుమ్మపాలల్లోని గోరెచ్చదనము, అరటిపూవులలోని అందంపుసిగ్గు, బీరపూవులవోలెవిచ్చు భావాలు, పరుగెత్తు పినలేడి పరువంపుశైలి", వీరి కవితాకాంతకు అత్యంత ప్రియమగు సామగ్రి. శ్రీమతి సోమరాజు ఇందుమతీ దేవిని యీాకాలమున కృషిచేసిన కవయిత్రులలో పేర్కొనవలసియున్నది. సుకుమార భావ పుష్పాలను లలిత పదసూత్రములో సుందరహారముగా యేరికూర్చుటలో యీా మెకు ప్రత్యేకవిన్నాణము గలదు. ప్రేయసినిగూర్చి ప్రియులభావాలను ప్రకటించుకవిత్వము మన ఆంధ్రవాఙ్మయమున సమృద్ధముగా గలదు. కాని ప్రియునిగూర్చి ప్రేయసి భావాలను చిత్రించు కవిత్వములేని కొరతను శ్రీమతి ఇందుమతిదేవి తీర్చినదని చెప్పవచ్చును. శ్రీకప్పగంతుల లక్ష్మణశాస్త్రి, శ్రీ కేశవ పంతులనరసింహశాస్త్రి, పెరవల్లి లింగయ్యశాస్త్రి, విద్వత్కవీశ్వరులు. గడియారము రామకృష్ణశర్మ చరిత్ర పరిశోధకులే గాక చక్కని కవిత్వమువ్రాసిన సారస్వతోపాసకులు.

## ప్రగతి సాహిత్యము

నెల్లుట్ల రామకృష్ణకవి ఓరుగల్లు ప్రాంతీయుడు. మూర్తీభవించిన ఆవేశము యీాయన కవిత్వము. ఈయనలో స్వకులాభిమానము హెచ్చు. ఆంధ్రభారతి మా యింటి ఆడుబిడ్డయని యీాయన చెప్పకొనినాడు. ఖండకావ్య రచనలలో యీాయన అందెవేసిన చేయి. ఈయన కవిత్వమున భావాలు హృదయమునుండి సూటిగా దూసి

కొని వచ్చుచుండును. 'నీ కొదమ కవిత్వము వాఙ్మయ సుదపత్నికి విభూషణంబు మభూషణంబు మధురకవీశ' అని యీయనను శ్రీ జాషువగారు ప్రస్తుతించి యున్నారు. ఈయన సూరబాల కావ్యమును సమీక్షించుచు పురాతనాధునాతన కవీశ్వరులకు మధ్యవర్తియనదగిన సాహిత్యవేత్త ఈయన యని 'గోలకొండపత్రిక' అభిప్రాయబడినది.

ఈ కాలమున గేయరచన యిక్కడి యువకులను యెక్కువగా ఆకర్షించినది- ఈ గేయకవులలో దాశరథికి సమున్నతస్థానము గలదు. కాళోజి నారాయణరావు ఈ గేయకవులలో అగ్రతాంబూలమునకు అర్హుడు. కాళోజి రాజకీయరంగమున ప్రథమశ్రేణిలో నిలిచి అనేక పర్యాయములు శ్రీకృష్ణ జన్మస్థానము నలంకరించిన దేశభక్తుడు. ఈయన హృదయమునకు సమ్మెటపోటైన ఒక్కొక్క రాజకీయ సంఘటన ఈయన కలమునుండి ఒక్కొక గేయముగా వెలువడినది. రసవిహీనములై ఎవరికిని చేపనియెండినచనులగు రాజకీయాలు ఈయన కలమునుండి సుధాధారలను ప్రవహింపజేసినవి. నల్లగొండలో చెల రేగిన నాజీశక్తుల నగ్ననృత్యమును గూర్చి ఈయన వ్రాసిన గేయము తెలంగాణ జిల్లాలోని ప్రజాసామాన్యమును ఆకర్షించి, పొలాలలో పనిచేయు కార్మికుల రసనాగ్రములమీద తాండవించినది. ఈయన కవితలో ఒక ప్రత్యేకమైన ఉక్తివైచిత్రిము, భావోద్రేకము ప్రస్ఫుటముగా గోచరమగుచుండును. "యుద్ధము మూలమున చెలామణులకు ఉబ్బులరోగము వచ్చినది." ఇట్టివి ఉక్తివైచిత్రిమునకు నిదర్శనము కాళోజి సహజకవి; ప్రజాకవి; అంతేకాదు, ఈయన కథకుడు గూడ. లంకాపునరుద్ధరణ అను యీయనకథ వ్యంగ్యవిమర్శద్వారా సమకాలిక పరిపాలనా విధానమును బాగుగా తూర్పారబట్టినది. ఈ గేయ కవులలో వెల్దుర్తి మాణిక్యరావు కొకప్రత్యేక స్థానముగలదు. ఈయన బాలవాఙ్మయ నిర్మాణమందు గూడ దక్షుడు. వెల్దుర్తి, కాళోజి కవులలో అనేకమైన పోలికలుగలవు. పొట్లపల్లి రామారావు ఈ యుగము నందలి కవులలోను, కథకులలోను విశిష్టస్థానము నాక్రమించుచున్న

వ్యక్తి. ఈయన కథలు, గేయాలు, అనేక పత్రికలలో ప్రకటితమైనవి. ఈయన రచనలందు హృదయావేదన, ఉద్రేకము ప్రముఖముగా గన్పట్టుచుండును. ఈయన వ్రాసిన సైనికుని జాబులు మన వాఙ్మయములో ఒక క్రొత్తరకమైన రచన. ఆధునిక లేఖావాఙ్మయమునకు మేలి అలంకారము. ఈనాటికవులలో శ్రీ పల్లాదుర్గయ్య, శ్రీ ఊటుకూరి రంగారావు, శ్రీ చిల్లర భావనారాయణరావు శ్రీ భాగి నారాయణమూర్తి, శ్రీ బి. రామరాజు, శ్రీ భూపాలరావు, శ్రీ రాఘవచార్యులు, శ్రీ పి. వి. నరసింహారావు, శ్రీమతి పర్సా జానకీదేవి, శ్రీఅడ్లూరి అయోధ్యరామకవి, శ్రీగార్లపాటిరాఘవరెడ్డి, శ్రీ పాములపర్తి సదాశివరావు, శ్రీ రామగోపాలరావు, శ్రీ నెల్లుట్ల వెంకటేశ్వరరావు, శ్రీ దేవులపల్లి వేంకటేశ్వరరావు, శ్రీమూటుకూరి వేంకటేశ్వరరావు, శ్రీ గవ్వామురహరిరెడ్డి మొదలైనవారు ప్రత్యేకముగా ప్రశంసనీయులు.

## చిన్న కథలు

ఈ కాలమున యువకు లనేకులు కథానికను ఉపాసించిరి. వారిలో శ్రీ భాస్కరభట్ల కృష్ణారావు అనేక కథలను వ్రాసి యావదాంధ్ర ప్రఖ్యాతిని పొందిన యువకుడు. ఈయన వ్రాసిన కథలు కొన్ని వందలకు పైగా నుండును. కమ్మని వ్యవహారిక భాషలో కథానికను ఒక కళాఖండముగ దిద్దితీర్చు నేర్పు యీాయన కలమునకు గలదు. శ్రీ పొట్లపల్లి రామారావుకథలు, సామాన్యజనుల జీవితమునందలి ఒడుదుడుకులను నిమ్నోన్నతములను, సమాజమందలి అన్యాయములను చిత్రించుచు సాంఘికాభ్యుదయమును ప్రబోధించుచున్నవి. పొట్లపల్లి, భాస్కరభట్లలు తెలంగాణ కథానిక సాహిత్య గగనమున దేదీప్యముగా వెలుగుచున్న తారలు. ధరణికోట శ్రీనివాసులు సాంసారిక సంఘటనలు రమ్యముగా చిత్రించు నేర్పుగల కథకుడు-ఈయనకు శ్రీ మునిమాణిక్యము భావనా గురువని చెప్పవచ్చును. బూర్గుల రంగనాథరావు సుప్రసిద్ధకవి ; కథకుడు- సారస్వతోపాసకుడు, ఈయన కథలు "వాహ్యాళి"అను సంపుట రూపమున వెలువడినవి. మధ్యతరగతి

కుటుంబాలలో దైనందిన సంఘటనలను తెలంగాణ వ్యావహారిక భాషలో మనోహరముగ తన కథలయందు యీయన చిత్రించినాడు. భాగి నారాయణమూర్తి గేయ కవియే గాక మంచి కథకుడు గూడ. సుప్రసిద్ధ కథకులైన నందగిరి వెంకటరావుగారి ధర్మపత్ని శ్రీమతి నందగిరి ఇందిరాదేవి తమ రచనల ద్వారా సకలాంధ్ర కథకులలో ఒక ఉన్నతస్థానము నాక్రమించుచున్నది. కొంచెము ఆలస్యముగా సారస్వత జీవనము ప్రారంభించి నప్పటికిని ఉత్తమ కథకులలో చేరదగిన సోదరీమణి శ్రీమతి ఇల్లిందల సరస్వతీదేవి. ఈ మధ్యనే యీయమ కథలు "పండుగ బహుమాన"మను పేరుతో ప్రకటింపబడినవి. తెలంగాణ కథకులలో శ్రీమతి భారతీ రత్నాకరాంబ. నెల్లూరి కేశవస్వామి, ఇటికాల నీలకంఠరావు, వెల్దుర్తి మాణిక్యరావు, తా-రా-స్వామి, మానేపల్లి తాతాచారి మొదలైనవారిని యిక్కడ పేర్కొనవలసి యున్నది.

## వ్యాసములు

ఈ కాలమున వ్యాసరచనకు యెక్కువ ప్రాముఖ్యత కలదు. ఏ విషయమును గూర్చియైనను చక్కగా ఆరటిపండొలచి చేతికిచ్చినట్లు వివరించి చెప్పగల విద్యార్థులైన వ్యాసకర్తలు అనేకులు ముందుకువచ్చినారు. వీరిలో గోలకొండ సంపాదకులు శ్రీ నరోత్తమరెడ్డి, ప్రగతి సంపాదకులు చంద్రమౌళీశ్వరరావు, పులిజాల హనుమంతరావు, కేశవపంతుల నరసింహశాస్త్రి, కాపోలు లలితాదేవి, యల్లాప్రగడ సీతాకుమారి, నందగిరి ఇందిరాదేవి, కోదాటి సోదరులు' బి. వి. రమణారావు, డి. వి. జి. కృష్ణమూర్తి, గొబ్బూరి రామచంద్రరావు, గొట్టుముక్కల కృష్ణమూర్తి మొదలయినవారు ముఖ్యులు.

ఉన్నతోద్యోగమునుండి ప్రభుత్వ కార్యనిర్వాహణలో తీరికలేకపోయినప్పటికి తెలుగుతల్లి కొలువును మరువనివారు శ్రీపర్వా వేంకటేశ్వరరావుగారు. వీరుప్రస్తుతము ఆంధ్రసారస్వత పరిషత్తు అధ్యక్షులు యువకులు, బి. ఏ. ఎల్. ఎల్. బి. పట్టభద్రులు. అనేక సారస్వత సంస్థలకు సహాయమొనర్చిన ఉదారులు; రసికులు; స్వయముగా

సారస్వతోపాసకులు, నేటి తెలుగువ్యాకరచయితలలో వీరికొక ప్రత్యేక విశిష్టస్థానము కలదు. ఇటీవల వీరు 'మన రాజ్యాంగము' అను పుస్తకమును వ్రాసినారు.

## వివిధ కళలు

నాట్యకళ, చిత్రకళ, మొదలైన రంగాలలో కూడ యీ కాలమున విశేషకృషి జరిగినది. హైదరాబాదులోని నాట్యకళాపరిషత్తు, ఓరుగల్లులోని కాకతీయ కళాసమితి, ఖమ్మం, సూర్యాపేట పట్టణాలలోని కళాసమితులు తమ ప్రదర్శనాలద్వారా కళోపాసన గావించినవి. ఈ కాలమున చిత్రకళయందు ప్రత్యేక నైపుణ్యము పై వర్ధించిన వారిలో శ్రీమతి సంగెం లక్ష్మీభాయమ్మను పేర్కొనవలసి యున్నది. ఈయమ చిత్రకారిణియేగాక మంచికథలను వ్రాయ నేర్పరి గూడ. సాహిత్యమును, చిత్రకళను విడిచి రాజకీయాలలో యీమె ప్రవేశించుట దురదృష్టము.

కొండపల్లి శేషగిరిరావు యీనాటి చిత్రకారులలో అగ్రగణ్యుడు, గోపాలరాజుభట్టు, వినయకుమారువంటి యువకులు చిత్రకళను, నాట్యకళను ఉపాసించుచు వ్యంగ్యచిత్రరచనలో నిపుణులుగా ప్రసిద్ధి గాంచినారు. గడియారం రామకృష్ణశర్మ, కె. వి. భూపాల్ రావు, వీరభద్రయ్య ప్రభృతులగు యువకులు, చరిత్ర పరిశోధనకు తమ అమూల్యమగు కాలమును వినియోగించుచు కాలగర్భమున దాగియున్న అనేక నూతనాంశములను వెల్లడి చేయుచున్నారు.

## రాష్ట్రేతర కవిపండితుల సేవ

తెలంగాణమువారుగాకపోయినప్పటికిని ఇక్కడనే స్థిరనివాసము కల్పించుకొని సాహిత్యసేవజేసిన విద్వాంసులను, కవులను కొందరిని యిచ్చట ప్రశంసించవలసియున్నది. సుప్రసిద్ధకవులగు శ్రీ రాయప్రోలు సుబ్బారావుగారు, తన సారస్వత కృషిని హైదరాబాదునుండి జరిపినారు. ఆచార్య శ్రీ కురుగంటి సీతారామయ్యగారి అనేక గ్రంథములు హైదరాబాదు నుండియే ప్రకటితములైనవి. శ్రీ సన్నిధానము

సూర్యనారాయణ శాస్త్రిలవారి సారస్వత కృషి యంతయు హైద్రాబాదు నందే జరిగినది. నరసభూపాలీయ వివరణము, తత్సమచంద్రిక అనే ఖండకావ్యములు, వచనరచనలను, శ్రీ సన్నిధానము వారు యిక్కడనుండియే ప్రకటించిరి. శ్రీ బిదురు శేషయ్యగారు హైదాబాదులో అనేక సారస్వత సంస్థలకు కార్యదర్శిగా ప్రశంసనీయమగు సేవజేసిరి. శ్రీ చలమచర్ల రంగాచార్యులవారి సారస్వత కృషికి తెలంగాణమే కేంద్రమైనది. వారి ప్రతాపరుద్రీయ అనువాదము, 'పోతననాటకము' హైదరాబాదు నుండియే ప్రకటితములైనవి. శ్రీఖండవల్లి లక్ష్మీరంజనము, బాలేందు శేఖరము సోదరులు, తెలంగాణ దేశీయులలో లీనమై బహుగ్రంథములను వ్రాసి ఆంధ్రభాషా దేవిని ఆరాధించుచున్నారు. కీర్తి శేషులైన అచ్యుతుని వెంకటాచలపతి రావుగారి 'అంపశయ్య' మొదలైన నాటకాలు యిక్కడినుండియే వెలువడినవి.

పండితులు, కవులు, విమర్శకులు, కథకులు అయిన శ్రీ అంబటిపూడి వెంకటరత్నముగారు తెలంగాణమునకు పెంపుడు కొడుకు. ఆయన చండూరు ప్రాంతములో చేసిన సారస్వత సేవ ప్రశంసనీయమైనది. అనేక యువకులను సాహిత్య రంగమునకు తీసుకొనివచ్చి వారిని కవులనుగా జేసిన గౌరవము శ్రీ అంబటిపూడి వారికి చెందుచున్నది. శేషాద్రి రమణకవులలో ఒకడైన శ్రీ దూపాటి వేంకటరమణాచార్యులువారు తమ సాహిత్య జీవనమును పూర్తిగా తెలంగాణమునకే అంకితము గావించిరి. జిల్లాలలో తాళపత్రగ్రంథములను శాసనాలను అన్వేషించి, పరిశోధించి, బహు ప్రయాసకు గురియై తెలంగాణమునకు వీరు ప్రశంసనీయమైన సేవజేసినారు.

ఈ కాలమున సాహిత్యకృషి విరివిగా జరిగినది. ఆంధ్రసారస్వత పరిషత్తు తెలుగుతల్లి సందేశమును పల్లెపల్లెలకు వాడవాడలకు తీసుకొని పోవుచున్నది. ఈ దశాబ్దమున 'గోలకొండ' దినపత్రిక వైనది. 'శోభ' ఓరుగల్లునుండి వెలువడి యువరచయితల రచనలకు స్వాగతమిచ్చినది. తెలంగాణ ప్రజాపోరాటమున విజయవాడనుండి వెలువ

డిన 'సారథి' పోలీసు చర్యతరువాత కూడ కొంత కాలము హైద్రాబాదునుండి వెలువడి సారస్వతోద్యమునకు మంచి చేయూత నిచ్చినది. పోలీసుచర్య తరువాత కాకతీయ, ప్రగతి, భాగ్యనగర్, జనశక్తి మొదలైన పత్రికలు యువకుల సంపాదకత్వమున వెలువడుచు సాహిత్యోద్యమ వనమున క్రొత్తపాదులను నిర్మించుచున్నవి. పండితులు పరిశోధకులు, కవులు, నగు గడియారము రామకృష్ణశర్మగారు సుజాతను పునరుద్ధరించి ప్రశంసనీయముగా భాషాసేవ జేయుచున్నారు.

## అన్యభాషాసేవ

తెలంగాణములో ఉర్దూపత్రికల ద్వారా ప్రజల జాతీయాశయములను నిర్భయముగా ప్రకటించి దేశసేవ జేసినవారిని ఈ సందర్భములో స్మరించవలసి యున్నది. శ్రీ మందుముల నరసింగరావుగారు సుప్రసిద్ధులైన ఆంధ్రనాయకులు. వీరు పేరెన్నికగన్న ఉర్దూరచయితలు. 'రయ్యతు' దిన వారపత్రిక సంపాదకులుగా వీరు నిర్భయ విమర్శలను జేసి ప్రజల వాంఛితాలను ప్రభుత్వము యెదుట నుంచిన ప్రఖ్యాత రచయితలు. బహుగ్రంథావలోకనము జేసిన రాజకీయ అర్థశాస్త్ర పండితులు. వాడి, వేడి యీ రెండు వీరి కలమునకు సహజగుణములు. అన్ని రంగాలలో మార్గదర్శకులైన శ్రీ మాడపాటి హనుమంతరావుగారు యీ రంగములోకూడ మార్గదర్శకులు. ఉర్దూభాషలో వీరు మంచి రచయితలు. 'ముషీరు' దినపత్రికలో వీరికి గల సంబంధము హైద్రాబాదీయు లందరికిని తెలిసినదే.

హైద్రాబాదునుండి వెలువడుచున్న ఇంగ్లీషు పత్రికలగు హైద్రాబాద బులెటిన్ దక్కన్‌క్రానికల్, న్యూయి-రా, డైలీ న్యూస్, సెంటినల్, స్ట్రగుల్, పత్రికల నిర్వహణ సంపాదకత్వములలో ఆంధ్రులకు ప్రముఖ స్థానముకలదు. దక్కన్ క్రానికల్ కు చాలకాలము సంపాదకులుగానుండి డెయిలీన్యూస్ పత్రికను స్థాపించి తన మరణము వరకు దానికి సంపాదకులుగా నుండిన తెలంగాణా పత్రికా సంపాదకులు శ్రీ బుక్కపట్టణము రామానుజాచార్యులవారు, ఆగ్లంభాషలో ప్రత్యేకమగు శైలిని కలిగిన మంచి రచయితలు.

ఈ విధముగ తెలంగాణమున అర్ధశతాబ్దమునుండియు ప్రాచీన, నవీన కావ్యపద్ధతులలో రచనలు సాగినవి. చిన్నకథలు, నాటకములు, వ్యాసములు, విమర్శలు, పరిశోధనములు వృద్ధినొందినవి. పత్రికలు, గ్రంథమాలలు, సారస్వతసంస్థలు ప్రారంభింపబడి మహోన్నత సారస్వతోద్యమమును నిర్వహించుచున్నవి. ఆలస్యముగ ప్రబుద్ధమైనను తెలంగాణము చక్కని చిక్కని నడకతో నిర్మాణాత్మక దృష్టితో ముందుకుసాగుచు సాటిసోదరులచే గౌరవింపబడు ఉత్తమస్థాయి నందుకొనుచున్నది.

—:—

# ఏది ఉత్తమ కళ?

మానవునకు సౌందర్య సంవీక్షణమువలన కలుగు ఆనందము ప్రకృతిసిద్ధమైనది. నిండు పున్నమనాడు పడమటి కాంత వొడిలో నపవ్వళించియుండు నెలబాలుని తిలకించినప్పుడు కాని, ఆకులు రాలక పూలువాడని ఆరామమందు "చిలుక పోటులచేత జెరగిన సహకార ఫలముల" నుండి స్రవియించు పచ్చితేనెను పరికించినప్పుడు కాని, మరి యెట్టి మనోహర దృశ్యమును గాంచినప్పుడు కాని, మన హృదయము లందు సౌందర్య సాక్షాత్కార మగుచుండును. విద్యాధికులకు, విజ్ఞానులకు, విద్యావిహీనులకు, అజ్ఞానులకు, శ్రీమంతులకు నిరుపేదలకు, స్త్రీలకు, పురుషులకు, బాలురకు, అందరికిని కొలదియో, గొప్పయో సౌందర్యశక్తి యుండితీరును. మానవునకు సౌందర్యమునందున్న సహజమగు ప్రేమయే ఆతడు లలితకళల నారాధించుటకు ప్రోత్సాహ కారణ మని చెప్పవచ్చును. మానవుని హృదయమున యెచ్చటనో దాగియున్న సృష్టిశక్తి పైకుబికివచ్చి ఏదో మూగరూపమును దాల్చుటయే లలితకళలయొక్క ఆవిర్భావమని చెప్పవచ్చును. లలితకళలు సౌందర్యముయొక్క భావచిత్రములు. కావున కళయొక్క స్వభావమును గుర్తించినప్పుడే మనముసౌందర్యదర్శనము చేయగలుగుదుము.

ప్రపంచమునందలి ఏ గొప్పకళనైన తిలకించుడు; అది ప్రత్యేక వ్యక్తియొక్క నిర్మాణ మని విశదమగును. అట్లగుటచే ఒక కావ్యము గాని ఒక చిత్రముకాని ఒక భంగిముకాని సరిగా పూర్వసాంప్ర దాయమునే అనుసరించి, ఇదివర కున్నవానివలెనే యుండి, ఒకే యంత్రమునుండి తయారుచేసిన నాణెములవలె నుండుట సంభవము కాదు—ఒక క్రొత్తభావము, ఒక క్రొత్త జీవకళ, ఒక క్రొత్త చైతన్యము కలిగినదే నిక్కమగు కళయని చెప్పవలసియుండును. పాత పాటలే తిరిగి పాడిన రోతగా నుండదా! ఉద్రేకము కవిత్వమునకే

కాదు- సౌందర్యప్రధానములగు కళ లన్నింటికిని జన్మస్థానమని చెప్ప వచ్చును. కవివలె చిత్రకారుడు కూడ భావనావీధులందలి తన యను భవములను వర్ణముల రూపమున ప్రదర్శించుచుండును.

లలితకళల లక్షణములను వివరించుచు సిద్ధాంతములను ప్రతి పాదించు గ్రంథము లనేకముకలవు. కాని యీ సిద్ధాంతములను మాత్రమే నమలి మ్రింగుట వలన యెవరికిని నవనవోన్మేషశాలిని యగు ప్రజ్ఞ లభింప జాలదు. సహజప్రతిభ పరిపూర్ణముగా అభివృద్ధి నొందుటకు దోహదముమాత్రమే కావించునవి లక్షణ గ్రంథములు. సాంప్రదాయము, కళను సమకాలిక సాంఘిక పరిస్థితులతో సమన్వ యించి ఆరెండింటికి సమరసభావము కలిగించునది మాత్రమే! ఒక కాల మున అత్యుత్తమముగా పరగణింపబడిన సాంప్రదాయము మరియొక కాలమున పనికి రాకపోవచ్చును. కావుననే కాలముతోపాటు సాంప్ర దాయములు మారి జాతీయ పునర్వికాసము జరుగుచుండును. కళ యొక్క సౌందర్యమును ప్రతిపాదించు యే యొక సిద్ధాంతమును గాని మనము ఆ విషయమున తుదిమాటగా అంగీకరించుట పొసగదు. సర్వ కాలసర్వావస్థలయందు కళాసౌందర్యమును ప్రతిపాదించు ఆదర్శ మిదియొక్కటేయని యెవ్వరును వ్రేలెత్తి చూపజాలరు. అట్లైనచో అభివృద్ధియను మాటయే మన శబ్దకోశమునుండి అంతరించవలసి యుండును. ఒక కాలమునందు ఒక గొప్పకళోపాసకుడు నిర్మించిన కళాశకలమును అచ్చుగ్రుద్దినట్లు మరల మనము తయారుచేయజాలము. అట్లుచేయుట కళగాదు; చేసినను అది యొక నమూనా మాత్రమే యగును. అందు కళా సౌందర్యము లోపించితీరును. ప్రత్యేకవ్యక్తిత్వము, వైలక్షణ్యము కలిగిన నిర్మాణమే కళోపాసకుల ఆదర్శము. బింబము లకు ప్రతిబింబములను తయారుచేయుట కళోపాసకుల పని కాదు.

కవిత్వము లలితకళలలో ప్రధానస్థానము నాక్రమించును- కావున కవిత్వమును గురించి చెప్పిన విషయములు ఇతర లలితకళలకు గూడ యథోచితముగా వర్తించును. కావ్యకళా సౌందర్యమునకు కారణభూతములగు విషయములు రెండు - మొదటిది భావచిత్రము ;

రెండవది భావచిత్రములను హృదయఫలకములందు ప్రదర్శించు మనో వికారము. కావ్యప్రపంచమున వ్యక్తుల భావచిత్రములు, వివిధవస్తువుల దృశ్యముల భావచిత్రములు, మానవుని సుఖదుఃఖముల భావచిత్రములు మున్నగునవి ప్రదర్శితము లగుచున్నవి. ఈ భావచిత్రముల వెనుక కవి యొక్కనివేకాదు, పాఠకుల మనోవికారములు కూడ గోచరించుచుండును. దుస్సహ దుఃఖానుభవములు, కంటికి నీరుదెచ్చి హృదయమును కరిగించు కరుణరసపరిపూర్ణములగు ఘట్టములు, పరమాత్మతో లీనమగుటకు అంతరాత్మ పడు ఆవేదన మున్నగు మనోవికారములతో పాటు "దాటిపోయిన యుగముల" నాటి చరిత్ర యొక్క భావచిత్రముల లలితకళలు మన యెదుట ప్రదర్శించుచున్నవి. కార్యకారణక్రమమున వివరింపరాని అనిర్వచనీయ మాధుర్యము సౌందర్యభూతి కవిత్వము మన కొసగుచున్నది. భావచిత్రములను మనోవికారములను కళాప్రపంచమున వేరుపరచుటకు వీలు లేదు. ఈ రెండు శక్తులయొక్క సరస సమ్మేళనకు కళాసౌందర్యము రెండు శక్తులుగాక కళాప్రపంచమున అనేక యితర విషయములు కూడ సౌందర్యదర్శనమునకు సహకారులు కావచ్చును. ఈ సందర్భమున కళావస్తువు చారిత్రకముగా గాని ఇతరత్రముగాగాని యథార్థము కావలసిన యవసరము లేదని మనవి చేయుట ఆవశ్యకము.

ఒక ఛాయచిత్రమును పరికించుడు—అది ప్రపంచమునందలి యొక మానవుని యొక్కగాని వస్తువుయొక్కగాని ప్రతిబింబము. ఈ ప్రతిబింబము కళాశకలము కాజాలదు. కేవలము వివిధవర్ణములయొక్క విచిత్రసమ్మేళనము కళ కాజాలదు. అట్లే వివిధ ధ్వనుల యోగసమ్మేళనము కూడా సంగీతము కాజాలదు. అదియే సంగీతమైనచో గాయకుడు కానివాడు కూడ సంగీతమును రచింపవచ్చును. తుట్టతుదకు వివిధధ్వనులను సాధ్యమైనన్ని విధములుగా సమ్మేళనము జేసిన తరువాత, వివిధశబ్దములను సాధ్యమైనన్ని విధములుగా సమ్మేళనము జేసినతరువాత సంగీతము, కవిత్వము ఈ ప్రపంచమునుంచి శాశ్వతముగా నిష్క్రమింపవలసి వచ్చును. కావున బాహ్యస్వరూపమును

గాంచి, శబ్ద వర్ణధ్వనుల సమ్మేళనముగాంచి, అదియే నిక్కమగు కళ యని భ్రమించుట ప్రమాదము. కళయొక్క సౌందర్యమును ప్రతి పాదించు భావచిత్రములు, మనోవికారములు లేనిది అది కళ యెన్న టికిని కాజాలదు. కవితా రసపిపాసువగు పాఠకుడొక గ్రంథమును పఠించినప్పుడు శబ్దజాలముయొక్క ఇంద్రజాలముతో సంతృప్తిపడక అందలి కావ్యసౌందర్యమును తనివిదీర యనుభవించును. మేధాసంపద, యుక్తివాదము, వివిధ విషయపరిజ్ఞానము ప్రపంచమునకు పరమోప కార మొనరించుట నిస్సంశయమే కాని రసపిపాసువులకు సౌందర్య సాక్షాత్కారము కలిగించు శక్తిమాత్రము వానికి లేదు. హృదయశక్తి లేని మేధాశక్తి, సౌందర్యములేని విజ్ఞానము, భార్యలేని భర్తయొక్క సంసారమువంటివి. ఇట్లని కళాసౌందర్యమును తృణీకరించు శుష్క హృదయులు గ్రహింపవలెను.

కళ తత్వశాస్త్రము కాదు; కళ చరిత్ర కాదు; కళ భౌతిక శాస్త్రముకాదు. గాలిలో మేడలుకట్టుట కళగాదు. భౌతిక శాస్త్ర తత్వశాస్త్రములవలె యుక్తివాదముపై ఆధారపడకున్నను, చరిత్ర వలె గతకాలమున జరిగిన సంగతులను గ్రహించునది కాకపోయినను, కళ యందుకూడ ఒక ప్రత్యేకమగు క్రమము, విలక్షణమగు సత్యము గోచరించుచుండును. అస్పష్టమై, క్రమబద్ధము గాక చెల్లాచెదరై యున్న మనోవికారములకు విశిష్టము క్రమబద్ధమునగు స్వరూపము నొసంగు టయే కళ యొక్క ప్రత్యేకత, కళ ఆకాశ హర్మ్యములను నిర్మించునది గాక ప్రతిభావంతమగు సృష్టిని గావించునది యని మనము గ్రహింపవలెను.

మన యందరికిని మనోవికారములు కలుగుచుండును. మనము సంతోషించెదము; దుఃఖించెదము; కోపించెదము; దయార్ద్రహృదయుల మగుదుము. ఆ సందర్భములందు అప్రయత్నముగా మననోటినుండి శబ్ద జాలము ఉబికివచ్చును. కాని యీ మాటలు కవిత్వము కాజాలవు. కవి యగువాడు తన మనోవికారములను ఏకముఖము గావించి క్రమబద్ధముగా వ్యక్తీకరించునప్పుడే అది కవిత్వమగును; అందు సౌందర్యము ప్రతిఫలిం

చును. కాని నోటికి వచ్చిన మాటలన్నియు కవిత్వము కాజాలవు. ప్రతిభా శాలియగు వ్యక్తిచే ప్రశాంతసమయమున సంస్మరణమునొంది వ్యక్తమైన భావములే కళాసౌందర్యమునకు ఆటపట్టులని యొక విమర్శకుని అభిప్రాయము. కావుననే మన యందరి హృదయములందు కలుగు మనోవికారములు తాత్కాలికములే. కవిత్వమునందలి మనోవికారములు శాశ్వతములై యొప్పుచుండును. అనేకులు పుత్రశోకము ననుభవించుచున్నారు. ఆ సందర్భము లందు మనోవికారము లెన్నియో రీతుల ప్రదర్శించుచున్నారు. ఈ ప్రదర్శనములు, ఈ ప్రలాపములు తాత్కాలికములు మాత్రమే. కాని కళయందలి శోక మట్టిది గాదు; దానికొక శాశ్వతత్వము కలదు. భారతమున అభిమన్యుని వధానంతరము—

'...పోటుబంటనై - అచ్చటికేతి పోయిత మహా గుణభూషణు గోలుపోయితిగా' అను నర్జునునిశోకమున కొకవిధమగు శాశ్వతత్వము కలదు. ఇదియే కళయొక్క విశ్వ జనీనత యని చెప్పవచ్చును. కావుననే కవి వ్యక్తీకరించిన శోకము, సంతోషము, కరుణ, వేడుక, వేదనలు ప్రత్యేక వ్యక్తిత్వములు కలిగి విశ్వజనీనములై యొప్పుచున్నవి. ఒకేయొక భావమును ప్రదర్శించు కళ కొంత వెగటు కలిగించవచ్చును, వైవిధ్యము కళయొక్క అందమును ద్విగుణీకృతమొనరించును. కావుననే కాబోలు మనవారు కావ్యమునందు అష్టాదశవర్ణనాదు లుండవలెనని విధించి కావ్యవస్తువును విశాలపరచినారు.

కళయొక్క ముఖ్యకర్తవ్యము ఉపదేశము, ప్రచారము అనుశాసనము కాదు- ఉపదేశము, ప్రచారము, అనుశాసనముఅంతర్వాహినులుగా నుండవచ్చును. కవిత్వమును కాంతాసమ్మితముగా గ్రహించిన మన ప్రాచీనులు యీ సత్యమును చక్కగా విశదీకరించినారు. "మానవజీవిత విమర్శనమే కళకు ముఖ్య ప్రతిపాదకమగు విషయము."

కళాసౌందర్యము యొక్క కేంద్రస్థాన మేదియను ప్రశ్న స్వాభావికముగా కలుగుచున్నది. ఒక చక్కని అజంతా చిత్రరువును తిలకింపుడు - ఆచిత్రము ఒక్కొక్క మానవునియందు అతని సంస్కృతి ననుసరించి ఒక్కొక్క విధముగా సౌందర్యానుభూతి కలిగించును. కొందరిని రవివర్మపటములే యెక్కువగా ఆకర్షించుట జూచుచున్నాము. కావున కళాసౌందర్యమునకు ఆటపట్టులు మన హృదయములే యని చెప్పుట మిక్కిలి సమంజసము.

పటమునందలి వర్ణములు, రేఖలు మున్నగు సాధన సామగ్రి మాత్రమే కళా సౌందర్యమున కాటపట్టులు గావు. అర్థ శాస్త్ర ప్రపంచమున నివి యుపయోగకరములగు వస్తువులు. ఇవి కావు-అని మనము స్పష్టముగ నిర్దేశించలేని విధముగనే కళాప్రపంచమున గూడ ఇవి సుందర మగు వస్తువులని మన మొక కడపటి నిర్ణయము చేయ జాలము. అర్థశాస్త్రమున అవసరము, సరఫరా మున్నగువిషయాలు వస్తువుల యుపయోగమును నిర్ణయించిన విధముగనే రసికుల మనో వృత్తి కళాప్రపంచమున సౌందర్యనిర్ణయము గావించుచుండును.

మనము కావ్యములను శృంగార కావ్యములు, వీరకావ్యములు అని వివిధములుగా విభజించుచున్నాము. ఇది మన సౌలభ్యమునకై చేసికొనిన విభజనమే కాని కావ్యసౌందర్యము కొలిచి చూపు మాన దండము కాదు. శాస్త్రప్రకారముగా ఒక కావ్యము సర్వలక్షణ సమ న్వితమై యుండవచ్చును- కాని సౌందర్యము సంపూర్ణముగా లోపించ వచ్చును. వ్యాకరణము, అలంకారశాస్త్రము, సాహిత్యశాస్త్రము, మున్నగునవి రచనాసూత్రములను బోధించి భాషా సాంప్రదాయము లను తెలుపుటకు సహకారము చేయును గాని కళయొక్క అంత రాత్మను చూపించజాలవు. కళాసౌందర్యమునకు పరమప్రమాణములు రసికుల హృదయములు మాత్రమే.

———:———

# సాహితీమేఖల వార్షికోత్సవ అధ్యక్షోపన్యాసము

---

సభాసీనులగు సోదర సారస్వతోపాసకులకు నమస్కరించి చేయు విజ్ఞప్తి :—

సాహితీ మేఖల వార్షికోత్సవ శుభ సందర్భమున, తెలంగాణపు సాహిత్య చరిత్రమున యొక ప్రముఖ పాత్రను నిర్వహించిన నల్లగొండ మండలము నందు నీలగిరి జన్మస్థానమునకు మిక్కిలి సమీపమున, నేడు మన మందరము సమావేశమైనాము. ఈ నాటి సభ తెలంగాణము నందలి వివిధ ప్రాంతముల నుండి విచ్చేసిన విద్యాధికులతో, కవులతో, కథకులతో, రచయితలతో, పూచిన తంగేడు వనమువలె శోభిల్లుచున్నది. ఇట్టి సదవకాశమును జారవిడువ నొల్లక డింభకుడు తన కొలంది యెరుంగక మహా పదార్థంబు గ్రహింప యత్నించు విధంబున, మిత్రుల యాజ్ఞను శిరసావహించి, అసమాన కళా రస పాన మత్తుడగు హనుమంతరాయని బలవంతము కాదనజాలక నేడు నేను మీ యెగుట నిలిచి నాలుగు మాటలు చెప్ప సాహసించుచున్నాను.

సాహిత్య మనగా నేమి? సాహిత్యము యొక్క ఉద్దేశమేమి? అను ప్రశ్నలు యీనాడు సారస్వత రంగమున వాదోపవాదములను పురికొల్పుచున్నవి. కొందరు విద్వాంసులు సాహిత్య దర్పణము, రస గంగాధరము, ధ్వన్యాలోకము, ప్రతాపరుద్రీయము మున్నగు ప్రాచీన ఆలంకారిక గ్రంథముల నాధ్రీకరించి పూర్వ సిద్ధాంతములను పునరుద్ఘాటించుచున్నారు. పత్రికలయందు పుంఖానుపుంఖముగా వ్యాస పరంపరను గుప్పించుచున్నారు. రేడియో చర్చలలో సిద్ధాంత రాద్ధాంతములను జేయుచున్నారు. ఇంకొక వంక నవ్యులు నూతన

వాదములను బయలుదేర దీయుచున్నారు. ఏ యొక పక్షమువారు గూడ తమలో తాము ఏకాభిప్రాయులై యున్నట్లు కానరాదు,

ఈ విధముగా సాహితీ ప్రపంచమున భిన్న కక్షులు కలవు. నిజమాలోచించినచో ఇట్లుండుట సహజమే. కళా ప్రపంచమునందు ఒకే అభిప్రాయము రాజ్యముచేయుట సాధ్యముకాదు. అది జీవకళకు చైతన్యమునకు నిదర్శనము కాదు. రణరంగమునందు సేనానాయకుని ఆజ్ఞలను శిరసావహించు సైనికునివలె, సారస్వతోపాసకు లందరును యేదో యొక ప్రత్యేక మతమును శిరసావహించుట సంభవము కాదు. సాహితీప్రపంచమున అభిప్రాయ భేదములు వర్ధిల్లుట సహజము. ఈ యభిప్రాయ భేదములే కళయొక్క సజీవత్వమునకు, మనోహరత్వమునకు నిదర్శనములని చెప్పుట సాహసముకాజాలదు. సజీవత్వమే లేనిచో కావ్యములు టంకసాలలో తయారగు నాణెములవలె, అచ్చు గుద్దినట్లు ఒకదానివలె నింకొకటి యుండక తప్పదు. అవి యట్లుండుటయే సంభవించినచో యీ కావ్య ప్రపంచపు మొగమునైన జూచువారుందురా! సహృదయులు కాంక్షించునవి, నమూనాలు, నకళ్లుగావు- చైతన్యవంతము, ప్రతిభాయుక్తమగు నిర్మాణమే నిజమైన సాహిత్యము.

ప్రపంచమున నివసించుచున్న అసంఖ్యాకులగు మానవులలో ఒకరిని పోలినవారు మరియొక్కరుండుట మిక్కిలియరుదు. ఈ మానవ కోటియందు సుందరాకారులును అనేకులు కలరు. కాని యా సౌందర్యశాలుల చక్కదన మంతయు నొకే తెగకు చెందినది కాదు, సౌందర్యవంతు లందరు ఒకరిని పోలి యింకొక రుండకున్నను, అందరును మనోహరాకారులే యని యొప్పుకొనక తప్పదు, మానవకోటియందు, స్ఫురద్రూపులందు, రూపసామ్య మంతగా లేకున్నను, యేదో యొక విశేషము, ప్రత్యేక గుణము వీరియందు సామాన్యముగా గోచరించును. అట్లే వాఙ్మయ ప్రపంచమునందలి వివిధ కావ్యములందును ఏదో యొక సామాన్యగుణ ముండుట స్వభావసిద్ధము.

ఈ సామాన్య గుణమునే రసము రామణీయకత యనియు చెప్పవచ్చును. ఇదియే కావ్య మనోహరత్వమునకు కావ్యానందమునకు కారణము.

ఈ సామాన్య గుణమేమి? యను ప్రశ్నకు ఉత్తరము సాహిత్యమనగా నేమి? యని ప్రశ్నించినప్పటికన్న, సాహిత్యము అవతరించుటకు కారణమేమి? యని ప్రశ్నించినప్పుడు, మనకు యెక్కువ స్పష్టముగా సులభముగా నిర్వివాదముగా లభించునేమో యని నాకు తోచుచున్నది. మధుమాసమునందు మావి చిగురులను మేసి మత్తిల్లినప్పుడే కోకిల కూ యని కూయుచున్నది. మింటిపై మెరపు, మేఘములు మేలమాడుకొనుచున్నప్పుడే నెమిలి నెచ్చెలి నృత్యమాడుచున్నది. కోకిలగానము వలె, మయూర నృత్యమువలె, సాహిత్యము గూడ కవి కుమారుని హృదయము ఆర్ద్రమైనప్పుడే అవతరించుచున్నది. ప్రకృతి సౌందర్య దర్శనము వలన కవి హృదయము ఆర్ద్రము కావచ్చును. దుస్సహ దుఃఖానుభవము వలన హృదయ తంత్రులు కదలవచ్చును. గాఢమగు ప్రేమ, నిశ్చలమగు భక్తిగాని భావములను ప్రేరేపింపవచ్చును. కాని భావ ప్రేరకమగు కారణము మాత్రము ఏదోయొకటి యుండక తప్పదు. హృదయములు చలింపక, భావములు ప్రకోపింపక తెచ్చిపెట్టుకొన్న ఆవేశముచే కదలెడు కలము వలన కలుగు ఫలితము సాహిత్యమెంత మాత్రమును కాజాలదు. అది శబ్దముల యొక్క ఇంద్రజాలము కావచ్చును. మరేమైన గావచ్చును. ఏకాగ్రత, భావోద్వేగము లేనివాడు కవి కాజాలడు. తాను చేయదలచిన కార్యమునకై ఆత్మార్పణము చేయ సమర్థుడే ఉత్తమ కావ్యనిర్మాత కాగలడు. జీవితమున తీవ్రతయున్నప్పుడే సాహిత్యశక్తి సంభూతమగును. శుక్తిలో రాలిన స్వాతివాన చినుకులే ముత్యములై ముద్దుగొలుపును. ప్రతిభావంతునికి గలిగిన వేడుక వేదనలే నవనవోన్మేషమగు కావ్యరచనకు కారణములగును. భావార్ద్రతలేని బడుగులకు కలిగిన ఆవేశము అడవి గాచిన వెన్నెలమాత్రమే. ఆవేశముచే శివము ద్రొక్కుచు ప్రేలిన చో నది సాహిత్యమెన్నటికిని కాజాలదు.

ఒకసారి నాట్యకళా ప్రపూర్ణుడగు తాడిపత్రి రాఘవా చార్యుడు "ప్రబలమగు అంతరాత్మ ప్రేరణ లేక యెవ్వరును యేమి యును చెప్పరాద"ని యీ యభిప్రాయమునే మిక్కిలి చక్కగా వ్యక్తీకరించినాడు. ఒక మహాకావ్యములనే కాదు. అంతరాత్మ ప్రేరణము మహాకార్యములకు కూడ మిక్కిలి యవసరము, భారత భాగ్య విధాతయగు మహాత్ముడు అంతరాత్మ ప్రేరణ కొసంగు ప్రాముఖ్యము అందరికి తెలిసినదే. ఉత్సాహమునకు, ఉద్రేకమునకు భావములను ప్రేరేపించు ప్రభావము గలదు.

మనసుపై సమ్మెట పోటులు పడినప్పుడే హృదయమునకు తీవ్రమగు ఆఘాతము కలిగినప్పుడే మహాకవి వాణి మధురవాణి యగుచున్నది. నిస్సీమమగు సౌఖ్యమునకన్న, దుర్భరమగు వేదనయే ఒక విధముగా కవి హృదయము కదలించుటకు యెక్కువ సమర్థమని చెప్పవచ్చును.హృదయమునం దొక విధమగు ఆవేదన, పరితాపము కలిగినప్పుడే సాహితీ సుందరి జగన్మోహినియై సాక్షాత్కరించు చున్నది. కావుననే మానవ సంఘమునకు సాహిత్యమునకు అవినా భావ సంబంధమున్నదను సర్వజనాంగీకారమగు సిద్ధాంతము. కళోపాస కుని భావములు ప్రేరేపించుటకు, ఆతని హృదయము కందళించుటకు ఆతడు వస్తువుగా స్వీకరించుటకు సంఘమున కన్న సర్వసంపన్నమైనది మరియొక్కటి లేదు. ప్రపంచమునందలి యుత్తమ సాహిత్యమెల్లను సాంఘిక జీవనముతో సన్నిహిత సంబంధము కలిగియున్నది. ప్రియు రాలి కమరత్వ మొసంగిన కవులు, ఘోరదారిద్ర్యమున కృశించుచు కవితావేశముచే చిందులుద్రొక్కిన కవులు, సంఘమునందలి యన్యా యముల నెదుర్కొని శ్రీకృష్ణజన్మస్థానము నలంకరించి అచ్చట మహా గ్రంథములను రచించిన మహనీయులు రాజకీయాది కార్యరంగము లందు శూరులై, కావ్యరచయితలయి యొప్పిన చిత్తరంజన, గోవింద వల్లభ మున్షీ ప్రభృతులవంటి రచయితలు ఆవేశముచే ప్రేరితులై సంఘమునందలి తమ యనుభవములను పురస్కరించుకొనియే కావ్య రచనా ప్రయత్నమునకు కటిబద్ధులై కృతకృత్యులైనారు.

తీరని యా వేదనచే కవిహృదయము కందళించునపుడే సారస్వత సలిల ప్రవాహము జాలువారును. అప్పుడే కవిభానుడు,

"నన్నెవ్వ రాపలేరీ వేళ
నాధాటి కోర్వలేరీ వేళ"

అని దుర్నిరీక్షుడై తేజరిల్లును.

ఆ నాడు ఆనంద పాత్రమున ప్రణయామృతము గ్రోలు క్రౌంచ మిధునమున కెడబాటు కలిగించిన క్రూర నిషాదుని ఘోర కార్యమును గాంచి ఆదికవియగు వాల్మీకి హృదయమునకు తీరని యావేదన కలిగినది. వాల్మీకి యంతరంగమున రగులుకొనిన ఆవేదనాగ్నియే రామాయణ మహాకావ్యము. రామాయణమున కాశ్రయమైనది మానవ సంఘము. సాహిత్యమున మానవ జీవిత ప్రాముఖ్యమును గుర్తించిన ప్రథమ కవీంద్రుడు వాల్మీకియే. హృదయము కదలక మనసు క్షోభించక సాహిత్య సృష్టి గావించుట యసాధ్యమేమో! మహాకవి తిక్కనార్యునకు ఇట్టి వేదన కలిగినందువలననే మహాభారత రచనకు కృతప్రయత్నుడైనాడు. ఆ నాటి స్వప్నమున పవిత్రమూర్తియగు కొమ్మనామాత్యుడు దర్శనమొసంగి హరిహరనాథ సాక్షాత్కారము ననుగ్రహింపజేసి భారత రచనకు శ్రీకారము జుట్టించుట తిక్కనార్యునకు గలిగిన భవ్యమగు నావేశముయొక్క ఫలితమే యనుట నిస్సంశయము. ఆతని హృదయమునందు చెలరేగిన వేదనయొక్క పరిణామమే యీ స్వప్నమనుట తథ్యము. భారతమునందలి ప్రతి పంక్తియును మానవ జీవిత విమర్శనమే. ఉద్యోగపర్వము ఆ కాలపు రాజకీయ జీవితమునకు ప్రతిబింబమేమో! తిక్కనార్యుడు స్వయముగా రాజనీతి కోవిదుడైన మంత్రి మాణిక్యుడు గదా!

పోతనాది మహాకవుల కావ్యములుగూడ ఆవేదన, ఆవేశములకు ఆటపట్టులైయున్నవి. కావుననే వానియందు రామణీయకత, జీవకళ యుట్టిపడుచున్నది. ఇంతెందుకు? సాహిత్య ప్రియులగు మహారాజుల చల్లని యేలుబడిలో ప్రజాసముదాయము పాడిపంటలతో

నిత్య కల్యాణము, పచ్చతోరణముగా గడిపిన కాలమందు అన్యవిచారము లేక శృంగార సరోవరములందు విహారమొనరించిన రాజహంసలగు మన ప్రబంధకవులు కూడ రసోద్రిక్తులయియే రచనారంగమున రాణించినారు. "స్తుతిమతియైన ఆంధ్రకవి ధూర్జటి పల్కులకేల గల్గెనో అతులిత మాధురీమహిమ" యను ప్రశ్నకు "సుకుమార వారవనితా జనితా ఘనతాప హారి సంతత మధురాధరోదిత సుధారస ధారల గ్రోలిన పారవశ్యమే" యను ప్రత్యుత్తరము గమనించదగినది. రసవదిష్టార్థ రక్తిచే వివశమైన హృదయమునందే కవిత యుద్భవిల్లుచున్నది. మన శతకములు, చాటువులు ఇందుకు మేలి నిదర్శనములుగా నున్నవి.

దక్షిణదేశ విద్యాసాగరుడై ఆంధ్రసాహితీ పునరుద్ధరణ ప్రభావుడని పేరుగాంచిన వీరేశలింగ దీక్షితుడు ఆనాటి సాంఘిక పరిస్థితులను గాంచి యావేదన చెందినవాడే. తరువాత మన నవ్యాంధ్రకవులనేకులు జాతీయ స్వాతంత్ర్యదృష్టముచే ప్రబోధితులైనవారే; దేశమాత పిలుపును అందుకొనినవారే, వీరగంధము తెచ్చినారము వీరులెవరో చెప్పుడీ యని యెవరికి వారు ప్రశ్నించుకొనినవారే. దేశదౌర్భాగ్యమును గాంచి మాతృదాస్య విమోచనమునకు సకల త్యాగము లొనరింప సంసిద్ధులైనవారే, ఇల్లు గాలునప్పుడు ఆత్మానందము కొరకు వీణియను చేబట్టు ప్రబుద్ధుడు కళోపాసకుడు గాకపోవుటయే గాక మానవత్వపు పొలిమేరకు మైళ్ళదూరమున గూడ నిలిచి యుండుటకు అర్హుడు కాజాలడు. అవసర సమయములందు ఆయుధమును ధరించుటకు గూడ వెనుదీయక కార్యశూరుడై కర్మవీరుడైన ఘనుడే కలముగూడ నడిపింపవలసిన యావశ్యకత నేడున్నది.

ఈ సందర్భమున నొక విషయము నొక్కి వక్కాణింపవలసి యున్నది. అన్ని విషయములనూ గురించి అందరికిని ఒకేవిధముగా ఆవేదన కలిగినను ప్రతి వ్యక్తియును కావ్యకర్త కాజాలడు. పద్మపత్రము

లందే మధువు లభించుచున్నది. శుక్తిలో నిలిచిన స్వాతివాన చినుకులే మౌక్తికములుగా మారుచున్నవి. ప్రతిభావంతునికి కలిగిన వేదుకయో, వేదనయో వాఙ్మయరూపమునొందినప్పుడే రససిద్ధికలుగుచున్నది. "ఎరువుల సొమ్ము బరువుల చేటు" అన్నట్లు తెచ్చిపెట్టుకొనిన ఆవేశము వలన, కృత్రిమమగు ఆవేదన వలన ఎవరి రచనలకు గాని కావ్యతత్వము సిద్ధింపదు. కావుననే ఏ యొక రాజకీయ సాంఘికాభిప్రాయములకో ప్రణమిల్లి ప్రచారముకొరకు వ్రాసిన వ్రాత లన్నియు సాహిత్యము కాజాలవు. రసోద్దీప్తులు కాని భాషాసేవకులు కావ్యనిర్మాణమునకు ప్రయత్నము గావించిన పరిహాసాస్పదులు కాకతప్పదు. సాహిత్యేతరమగు విజ్ఞానవాఙ్మయ నిర్మాణము కొరకు వారు కృషిచేయుట అవశ్యకము. అర్థశాస్త్ర రాజకీయ శాస్త్రాది సాంఘిక శాస్త్ర విజ్ఞానముతో పాటు భౌతిక విజ్ఞానము యీనాడు ఆంధ్రభాషకు మిక్కిలి అక్కరమై యున్నది. సాహిత్యము మానవ జీవిత విమర్శన మను సిద్ధాంతము నంగీకరించినప్పుడు వాఙ్మయము కాలకర్మానుగతమై విలసిల్లునని యొప్పుకొనక తప్పదు. ఇది భౌతిక విజ్ఞానము పరిపక్వమగుచున్న కాలము; atomic energy యొక్క యుగము.

నేటి తెనుగు సారస్వతము వంక తిలకించునప్పుడు ఆధునికాంధ్ర రచయితల నాకర్షించుచున్న వాఙ్మయ విభాగములు ఖండకావ్యము, గేయము, కథ మాత్రమే యని విస్పష్టమగుచున్నది. అచ్చటచ్చట ఏకాంక నాటికలను వ్రాయువారు కలరు. ఈ రచయితలు సమకాలిక జీవితమునందలి విషమ సమస్యల వంక తమ దృష్టిని మరల్చకుండుట శోచనీయము. కాళోజి, పొట్లపల్లి మున్నగు కొందరు యువకుల రచన లందు మాత్రమే దేశమునందు జరుగుచున్న కల్లోలములను గురించిన యావేదన కానుపించుచున్నది. పిళ్ళా వేంకటరత్నకవి యొక్కరు నాకు దెలిసినంతవరకు భారతస్వాతంత్ర్యమునందలి వీరఘట్టములను కావ్యగానము జేసినారు. కాని అనేకులు ఇంకను బాహ్య ప్రపంచమును మరచి గాలిమేడలలోనే ఉయ్యాలలూగుచున్నారు. ప్రజాబాహు

శ్యమున కొక దివ్య సందేశ మొసగవలసిన బాధ్యత తమపై కలదని గుర్తింపకున్నారు.

వంగదేశపు కాటకము మనవారిలో యెందరి హృదయ తంత్రులను కదలించినది? 1942 సంవత్సరపు జాతీయోద్యమమునందలి వీర గాథలు తలచుకొన్నంతనే ఒడలు జలదరింపజేయు సాహస కృత్యములు యెందరి లేఖినుల నాట్యమాడించినవి? సుభాసుని శౌర్యము, జయప్రకాశాదుల యద్భుత పరాక్రమము వస్తువుగా స్వీకరించిన రచయిత లెందరున్నారు? మహాత్ముని యుపవాసములు, త్యాగ సంపద, తుపాకి గుండకు గుండె నెదురొడ్డిన మహాపురుషుల పవిత్ర చరిత్రము, అనాథుల యశ్రుధారలు యే కవీశ్వరుని భావనాశక్తిని విజృంభింపజేసినవి? ఏ కథకునికి ఇతివృత్తమై యొప్పినవి? నేడు ఏకాకియై, పాదచారియై, కాళ్ళు బొబ్బలెక్క, ఎండయనక, చలియనక, అసిధారావ్రతము బూని వంగదేశమున ఘోరతపస్సు గావించుచున్న కరుణాస్వరూపియగు మహాత్ముని యనుభవములకన్న ఉదాత్తమగు కవితావస్తువు కలదా? ఆలోచింపుడు. ఇటీవల మన దేశమున జరుగుచున్న యమానుషములు, ప్రవహించుచున్న రక్తస్రవంతులు, యెందరు సారస్వత సేవకుల హృదయముల కాఘాతము కలిగించినదో యోచింపుడు.

తుదకొక్కమాట, కావ్యములు, గేయములు, కథలు సారస్వత రంగమున ముఖ్యపాత్రను ధరించుటయందాశ్చర్యమేమియును లేదుకాని ఇవియే సమగ్ర సారస్వతము కాజాలవు. మన భాషకు అనవసరమైన అభివృద్ధి చాల కలదు. దేశచరిత్రలు, జీవిత చరిత్రలు మనకు మిక్కిలి స్వల్పముగా నున్నవి. అరటిపండొలిచి చేతికిచ్చినట్లు విషయ నిరూపణచేయ సమర్థులైన వ్యాసకర్తలు మనలో మిక్కిలి స్వల్పముగా నున్నారు. శాస్త్రీయ విజ్ఞానము మన భాషలో లేనే లేదనిన అతిశయోక్తి కాజాలదు. శిల్పము, సంగీతము, చిత్రకళ

మున్నగు వానిని గురించియైన కొంత విజ్ఞానము నొసంగ గల గ్రంథ జాలము, మనకు మృగ్యము. మన యువకులందు విశ్వవిద్యాలయ పట్టభద్రులనేకులు కలరు. కొందరు తమ యభిమాన విషయము లందు ప్రత్యేక పరిశ్రమ గావించుచున్నారు విదేశ యాత్రలను గావించి బహు గ్రంథావలోకన మొనరించిన వారు కలరు. వీరు తమ విజ్ఞానముతో మాతృభాషను పూజింపవలసిన యవసరము కలదు.